# రుమేనియా దేశము

ఇప్పుడు తటాలున రుమేనియాదేశము చర్చ పత్రికలకెక్కినది. దీనివివరాలు తెలుసుకొనుటకు కొంతపూర్వచరిత్రఅవసరము.

**దేశము**

రుమేనియా దేశముచుట్టును హంగేరీ, రష్యా, యుగోస్లావియా, జకోస్లోవాకియా బల్గేరియాఅను దేశాలున్నవి. దూర్పున నల్లసముద్రమున్నది. ఈ దేశముచాలా సారవంతమైనట్టిది. జనసంఖ్య సుమారు ౧ కోటి ౯౫ లక్షలమంది కలిగినట్టిది. వైశాల్యము ౧౧౩౦౦౦ చదరపుమైళ్లు. ఈదేశములో గోధుమలు. మక్కజొన్నలు, పొగాకు, మానెగనులు, సమృద్ధిగానున్నవి ౧౯౩౯ లో ౭౦ లక్షల టన్నులనూనెతీసినారు. అయితే రైతులుమాత్రము ఇండియా రైతులవలెనే అష్టదరిద్రులు, వారున్నూ ఎప్పుడూ అప్పులపాలే. మితిలేనివడ్డీతో అప్పులుతీసుకొని యెట్లోజీవనంగడుపుచుందురు ఈదేశానికి ముఖ్యపట్టణం బుఖారెస్టు అనునది అచ్చటధనికులు ఎల్లప్పటికిని ప్యారిసు నగరములోవలె ఆనందాలలో ఓలలాడుతూఉందురు. ఈదేశము యూరపుచరిత్రలో ప్రసిద్ధికన్నట్టిదికాదు. చిల్లరదేశాలలోనే లెక్క అయితే యింతకంటేచిన్న దేశమైన హాలెండుదేశముగొప్ప సామ్రాజ్యం స్థాపించున్నది. అంతకన్నచిన్నదైన పోర్చుగల్లు దేశముకూడా అక్కడక్కడ రాజ్యాలు సంపాదించుకున్నది. కానిరుమేనియాకట్టి చారిత్రికవిఖ్యాతియేమిన్ని లేదు. ఫ్రాన్సుదేశములో ఫ్రెంచిజాతి-జర్మనీలో జర్మన్‌జాతి ఇంగ్లాండులో ఇంగ్లీషుజాతిఅని ప్రత్యేకతకలవైయున్నవి. రుమేనియాలో అట్లేమిన్నీలేదు అచ్చట ౭ లక్షల జర్మనీలున్నారు. ౧౩ లక్షల హంగేరియాలున్నారు. ౩ లక్షల ౫౦ వేల బల్గేరియాలున్నారు ౭ లక్షల ౫౦ వేల యహూదీలున్నారు గ్రీసుజనులున్నూ ఉన్నారు. ఇటలీవారలున్నూ ఉన్నారు అందరు కలగలిసి ఒకరంగుగా ఏర్పాటైంది యీరుమేనియా దేశము.

**రాజు**

ఇప్పుడీదేశము రాజుపేరు కెరోల్ ఇతని తండ్రిపేరు ఫర్డినెండు. తల్లి మేరీ రాణి. ఈమేరి ఇంగ్లాండురాణీ యైయుండిన విక్టోరియా చక్రవర్తినికి మనిమనుమరాలు. ఇంగ్లీషురాజబంధువైన ఎడింబరో డ్యూకుయొక్క బిడ్డ ఈవిధంగా రుమేనియాకు ఇంగ్లీషు సంబంధ మేర్పడింది. ఇది గత ౧౯౧౪ జర్మనుయుద్ధములో పనికివచ్చెను, ఈమేరీరాణి మూలాననే రుమేనియా దేశము జర్మనీ పక్షంలోచేరకుండా ఇంగ్లాండు పక్షంగా చేరి యుద్ధముచేసెను దానివల్ల అప్పుడేమో రుమేనియాకు లాభంకూడా కలిగెను, ఈమేరీరాణి పెద్దకుమారుడే కెరోల్‌రాజు. ఇతడు మంచిరసికుడు. ఇతడు లింబ్రినో అను సాధారణస్త్రీని తల్లియిష్టానికి వ్యతిరేకంగా పెండ్లాడెను. అందుచేత రాజ్యానికి స్వస్తిచెప్పెను. పెండ్లికూడా రద్దయ్యెను. మరొకమారు హెలెన్ అను గ్రీసురాజు బిడ్డను పెండ్లాడెను. ఆమెకు కొంతకాలానికి విడాకులిచ్చి వెళ్లగొట్టెను. తర్వాత లూపెస్కూ అను స్త్రీని ఉంపుడుగత్తెగా ఉంచుకొనెను. ఇప్పటికిని ఆ స్త్రీ యీతని ఉంపుడుగత్తెగానే ఉన్నది, తన తండ్రి చనిపోయినతర్వాత రాజ్యములోని కొందరి సహాయముచేత కెరోల్‌రాజ్యాన్ని ఆక్రమించుకున్నాడు. ఆనాటినుండి రాజుగా నున్నాడు. ఈ కెరోల్ రాజుకు మంచి సొంతఆస్తికలదు. ప్రభుత్వమునుండి ఏటేట తన సొంతఖర్చుకుగాను సుమారు ౪౨౦౦౦ పౌనులు తీసుకొనుచున్నాడు. ఇతడు విదేశీబేంకులలో లక్షల ద్రవ్యాన్ని కూడబెట్టినాడని ప్రతీతి.

**దేశవిస్తృతి**

గత జర్మనుయుద్ధములో అనగా ౧౯౧౪నుండి ౧౯౧౮వరకు జరిగినయుద్ధములో రుమేనియా ఇంగ్లీషు ఫ్రెంచివారి పక్షముగా నున్నందున యుద్ధానంతరము ఆదేశానికి చాలా లాభము కలిగింది. ౧౯౧౪సం॥కు పూర్వము రుమేనియా వైశాల్యము ౫౩౪౮౯ చదరపుమైళ్ళు. అనగా మన హైద్రాబాదు రాష్ట్రముకన్న ౭౦౦౦ చదరపుమైళ్ళు తక్కువవైశాల్యము కలదిగా నుండెను. గతయుద్ధంలో మిత్రమండలియైన ఇంగ్లాండు ఫ్రాన్సుదేశాలపక్షాన యుద్ధంచేసినందున యుద్ధానంతరం ఇంచుమించు ౪౦౦౦౦ చదరపు మైళ్లుగల ఎక్కువదేశాన్ని సంపాదించుకొన్నది, ట్రాన్సిల్వేనియా అనుభాగాన్ని హంగేరీనుండి లాగి యియ్యబడింది. బుకోవీనా అను భాగము ఆస్ట్రియానుండి లాగియిచ్చినారు. బల్గేరియానుండి నాడ ఒకచిన్నముక్కను, డోబ్రూజా అనుదాన్ని గిల్లుకొన్నది.

ఇదియిట్లుండ రష్యాలో యుద్ధము జరుగుతూ ఉండగానే గొప్పవిప్లవము జరిగెను. జనులు రాజును చంపిరి. బోల్షివిజం వ్యాపించి రైతు రాజ్యాన్ని స్థాపించిరి, ఆగందరగోళములో రుమేనియా మెల్లగా రష్యాకుచెందినట్టి బెస్సరేబియా అను మండలాన్ని మరికొంత యితరభాగాన్ని ఆక్రమించుకొని గట్టిగాపోనియ్యకుండా పట్టుకొనెను. రష్యా తన యిబ్బందిలోనుండెను. దీనితో యెందుకు వివాదమని ఊరకునవలసివచ్చెను. కాని రష్యాదేశం ఆనాటి ఆక్రమణాన్ని మరచిపోలేదు. సమయానికై ఈ ౨౩ఏండ్లు పొంచిఉండింది. అది ఇప్పుడు లంభించింది.

**రష్యానాటకం**

యూరోపులో ముగ్గురు నియంతలు ఒకవిషాదనాటకాన్ని ఆడించుతున్నారు. సమయముదొరికితే అమాంతంగా దేశదేశాలను మింగివేయడం వీరికి పరిపాటియైనది. హిట్లరు, ఆస్ట్రియా, జెకోస్లోవాకియా మింగినాడు ముసలోని అబిసీనియా, అల్బేనియాలమింగినాడు హిట్లరు పోలెండుపై చేయిచాచేవరకు యుద్ధమే వినుకొని మీనపడెను. ఇక రష్యా నియంతయగు స్టాలిన్‌గారిది పిల్లివేటగాఉన్నది. చప్పుడు చేయకుండా పొంచిఉండడం షికారీ సులభంగా దొరికేఅట్టుందిరాఅని కనబడేవరకు గబుక్కుమనిమీదపడడం కంఠ్లురిని బెదరించడం, హరించి జీర్ణించుకోవడం ఇదిఆయన రాజనీతి. జర్మనీ అవస్థపడి పోలెండును ముప్పాతిక జయిరిచెను, ఎక్కడినుండో రష్యా తటాలున ఊడిపడి పోలెండులో సగంభాగంమింగి కూర్చొనెను. హిట్లరు కిక్కురుమనకుండా రష్యాభాగం రష్యాకు పంచియిచ్చినాడు. మరిహిట్లరుకున్ను ఫ్రెంచి ఇంగ్లీషువారికిన్ని ఫ్రాన్సు సరిహద్దువద్ద యుద్ధం జరుగుతూ ఉండింది. నాదిక్కువచ్చేవాడు లేడని ఈరష్యా ఎలుపుగొడ్డు తటాలున లాటివియా, లిథునేనియా, ఎస్టోనియా అనే మూడుచిన్న దేశాలపైబడి వాటినుండి కొన్నిరేవులు కొన్నిహక్కులు లాగుకున్నది. తర్వాత ఫిన్లాండుపై చేయిజాపినాడు కాని ఫిన్లాండు తిరుగబడింది. ౨ నెలలు హోరాహోరిగా యుద్ధం జరిగింది. అప్పుడు రష్యాముగితనం కనబడింది. చూచేదానికి ఒకగొప్పఖండమే రష్యాదేశము. లెక్కించేదానికి ౩౦ లక్షలకుపైగా సైన్యముంది. ఫిన్లాండుకి పిట్టపాణం అయినా రష్యాసైన్యాన్ని తుక్కుతుక్కుగా కొట్టి వెళ్లగొట్టింది. అయితే ఎన్నాళ్లుజరుగుతుంది. జర్మనీ ఇంతలో కొంచెం చేయిచేసుకుంది. నార్వే స్వీడన్‌వారు ఫిన్లాండుకు సహాయంచేయకుండా బెదిరించింది, అంతటితో ఫిన్లాండులో బడింది.

మళ్లీ రష్యా ౫ మాసాలు అలసటతీర్చుకుంది. ఫ్రాన్సులో గడబిడలనుజూచి మళ్లీసమయము వచ్చిందనుకుని స్టాలిన్‌గారు పూర్వము లోబడిన లాటివియా లిథునేనియా, ఎస్టోనియా దేశాలను మరల ఇంకొకొంతదబాయించిఅందులో తనసైన్యాన్ని నిలబెట్టి ఇంచుమించు తనవశంచేసుకున్నారు. ఇదిఇట్లుండగా గతవారం రుమేనియాకు ఈ స్టాలిన్ తటాలున ౨౪ గంటల అవకాశమిచ్చి నోటీసుయిచ్చినాడు పూర్వంతీసుకున్న బెసరేబియానున్ను బుకోవీనానున్ను మాకు తిరిగి ౨౪ గంటలలోగా యిస్తావా యేమంటావు అన్నాడు. రుమేనియాకూడ లోబడింది. ఆ రెంటినిచల్లగా సమర్పించుకున్నది.

**హంగేరీ దబాయింపు**

దీన్నిచూచి హంగేరీవారున్ను బల్గేరియావారున్ను లేచికూర్చున్నారు. ౨౦, ౨౨ ఏండ్లక్రిందట మాదేశాలలోని భాగాలను రుమేనియావారైన మీరుమీదేశంలో కలుపుకున్నారు. ఆవిమాను తిరిగియిస్తావాలేదా అని అడుగుచున్నారు. అయితే హంగేరీ బల్గేరియా దేశాలు చిన్నదేశాలు అందుచేత రుమేనియా దెబ్బకుదెబ్బ తగిలించుతానుచూడు అనిఅంటున్నది. ముందేమి జరుగుతుందేచూచుచూఉందాము. రుమేనియాలో శాంతి కాలంలో ౧౨౦౦౦౦సైన్యము మాత్రమే యుంటుంది యుద్ధకాలంలో ౧౫లక్షల సైన్యంసిద్ధంచేయగలదని చెప్పుదురు ఇప్పుడు రష్యాతను కొన్నభాగంలోని జనసంఖ్య సుమారు ౩౦లక్షలు. ఆభాగంపోగా ఇక మిగిలినభాగంలోని సైన్యం ఇంకా తక్కువగావేఉంటుంది.

---

# జమియతు, ఆజాదుపార్టీల సభలు

ఢిల్లీ, జూను ౨౩

జూలైనెల ౧౨-౧౩-౧౪ తేదీలలో జమియతుల్ ఉలేమాపార్టీ కార్యసంఘసభయున్ను, ౧౪-౧౫ తేదీలలో ఆజాదు ముస్లింపార్టీ మొదటిసభయున్ను ఢిల్లీలో జరుగును.

---

# జ్వర విషయములు

స్వస్థత చెందుటకు ఆహారము ముఖ్యముగా తోడ్పడును. శాస్త్రిపరిశోధకులు జ్వరమునుగురించి నూతనవిషయములను తెలియపరచినారు. అదే మనదేహఉష్ణము హెచ్చుట, సహించలేని తలనొప్పి వణకు చలి మొదలగునవి జ్వరచిహ్నములు, జ్వరవిషమురక్తమునందుకలసినరకండముల లోప్రవేసించి మనుష్యుని బలహీనునిగాచేయును.

పూర్తిగా స్వస్థతచెందుటకు పూర్వము అలసిన అవయవములనుతిరిగి అభివృద్ధిచేయుట అత్యావశ్యకము అందుకుగాను గట్టిగానుండు సర్వసాధారణ ఆహారముపలికిరాదు. కారణము కడుపునీరసముగానుండి జీర్ణించశక్తి లేకపోవుటచేత.

జ్వరపీడితులకు, హార్లిక్సు శ్రేష్ఠమైన ఆహారపదార్థమని ఋజువుచేయబడినది. క్లిష్టసమయము హార్లిక్సు తీసుకొనుటవలన కడుపుకేవిధమైన బాధకలుగదు. స్వస్థతపొందుటకు కావలసినవస్తువులు దీనియందున్నవి. అనతికాలములో దేహారోగ్యమునిచ్చి నూతనయవ్వనవంతునిగాచేయును. సాధారణముగా అన్ని ఆస్పత్రిలలోను హార్లిక్సును జ్వరబాధితులకుఇచ్చు ఏర్పాటుచేసినారు.

---

# వైస్రాయిగారికి హిందూ యువక పార్టీవారి సందేశము

లక్నో, జూను ౨౩

లక్నో హిందూయువకపార్టీ కార్యసంఘసభ నిన్నసాయంకాలము యిక్కడ జరిగినది. "అఖిలభారత హిందూమహాసభవారికి సంతృప్తికరముగా వుండనట్టి రాజ్యాంగవిధానము భారత హిందూయువకులు అమోదించరు" అని సభవారు తీర్మానించిరి. ఈతీర్మానమును తంతిద్వారా వైస్రాయిగారికి తెలియజేసిరి.

---

# ఉస్మానియా సాంకేతిక కళాశాల

హైదరాబాదు (దక్కన్), అమర్దాదు ౨౫

ఉస్మానియా టెక్నికల్ కాలేజిలో మేజర్ స్లాటర్ గారు విద్యార్థులకుపన్యసించిరి. ఈ కళాశాలవారిప్పుడు విమానములకై విద్యార్థులను సిద్ధముచేయుటకు ఒప్పుకున్నారు. ఈ సమయములో చేయుకృషివలన ఇప్పుడు యుద్ధానికి సహాయమగుటయేకాక ముందుకు ఒకగొప్ప పరిశ్రమాలయమును స్థాపించినవారగుదురు. ముందుకాలములో రాష్ట్రములోని లోహపుగనులనుగూడ గుర్తించుటకు ఉపయోగపడుదురు. ఉపన్యాసానంతరముచాలామంది విద్యార్థులు స్లాటర్‌గారి సూచనలప్రకారము పనిచేయుటకొప్పుకొనిరి.

---

# న్యాయశాఖా మంత్రిగారి పర్యటనము

హైదరాబాదు(దక్కన్), అమర్దాదు ౨౫

నా॥ అబ్దులజీజు న్యాయశాఖా మంత్రిగారు తమదౌరాలో ఆందోలుకువెళ్లిరి, అచ్చట డాక్ బంగ్లాలోదిగిరి, వకీల్లు అధికారులు అచ్చట వారిని కలసిరి. తర్వాత వారు మున్సిఫ్ కచ్చేరీని పరీక్షించిరి. అచ్చట వకీళ్ళు వారికి పూలహారము వేసిరి. అందరితో సౌముఖ్యముతో మాట్లాడిరి. స్థానిక బీదముసల్మానులతో బాగా మాట్లాడిరి. వారితో నమాజుచేసిరి. నమాజుతర్వాత ఆ మసీదు చిన్నదిగాఉన్నది విశాలముచేయవలెనని కోరగా దానివిషయమున శ్రద్ధతీసుకొందుమని సెలవిచ్చిరి, హిందువులు తమ హనుమంతుదేవళాన్ని చూడుమనికోరగా ఒకఫర్లాంగుదూరమునడిచి వెళ్ళిచూచి వచ్చిరి. స్థానికగ్రంథాలయాన్ని కూడా చూచి ౧౫రూపాయీలు విరాళమిచ్చిరి. (రహబర్)

---

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర జ్యేష్ఠ బ॥ ౧౮

గురువారము


## ఆర్థికాభివృద్ధి

ఔంధు ౩ లక్షల వార్షికాదాయము మాత్రమే కల చిన్న సంస్థానము. అయినా ఆసంస్థానము జగద్విఖ్యాతి పొందినది. కారణమేమన దానిని పాలించురాజు వయోవృద్ధుడు. జ్ఞానవృద్ధుడు. పరమ సాత్వికుడు. మేధస్సంపన్నుడు. పరమోదారి. నిజమైన ప్రజారంజకుడు. ఇంచుమించు ౬౦౦ దేశీయసంస్థానములలో ఈ సంస్థానమం దొక్కచోటమాత్రమే బాధ్యతాయుత ప్రభుత్వము స్థాపింపబడినది. సంస్థానము చిన్నదైతేనేమి ఇదొక్క యంశమే దాని నగ్రస్థానానికి తీసికొనివచ్చినది. అట్టి ఔంధు సంస్థానపు ప్రభువులుంగారు పది పన్నెండు దినాలక్రిందట బెంగుళూరులో నొకసభలో భారత దేశములోని ఆర్థికాభివృద్ధిని గురించి కొన్ని అమూల్యమగు సూచనలు చేసినారు. అవి ప్రతిభారతీయుడును జ్ఞాపకముంచుకొని దీక్షతో ఆచరించుకొన దగినట్టివి.

ఇప్పుడు ప్రపంచమంతా వ్యాపారముపై ఆధారపడియున్నది. ఒక విధంగా ఈవ్యాపారానికే యుద్ధాలన్నీ జరుగుచుండును. "ప్రపంచములో నాకు అడ్డంకులులేని స్వేచ్ఛావ్యాపారము కావలెను" అని హిట్లరు ఇటీవలనే ఒక అమెరికా ప్రతినిధితో చెప్పెను. పాశ్చాత్యదేశాలలోని కొన్ని జాతులు సామ్రాజ్యాలు సంపాదించినది స్థాపించినది పట్టు విడువకుండా పట్టుకొని కూర్చున్నది ఈ వ్యాపార సౌకర్యానికే. వ్యాపార సౌకర్యాలు లేకపోతే పాశ్చాత్యదేశాలకు ఏషియా ఆఫ్రికా ఖండాలమీద భ్రమ,ఆశ,నశించిపోవును. యూరోపుఖండములో యంత్రాలు ఎక్కువైనవి. ఏషియా ఆఫ్రికా ఖండాలలో ఒక్క జపాను తప్పితే తక్కిన ప్రాంతాలలో అవిలేవు. పాశ్చాత్యులు ఏటేట ఏవేవో ముచ్చటయగు వస్తువులను సిద్ధము చేయుదురు. రబ్బరుబొమ్మలు, రబ్బరుపీకెలు, లక్కసామానులు, ఇత్తడిసామానులు, ఆటవస్తువులు, తిండివస్తువులు, బట్టలు మున్నగునవి యెన్నియో మన దేశాలకు తెచ్చి అగ్గువగా అమ్మి మన పైకాన్ని కోట్లకొలదిగా తీసుకొని పోవుచున్నారు. భారతీయులంతటి వ్యర్థులు, మూర్ఖులు ఇంకొకరు లేరు అనికూడా ఆదేశాలవారు అనుకొనుచుండవచ్చును. మనము దరిద్రులమైనా పనకిరాని రబ్బరు బొమ్మలకు లక్కబొమ్మలకు ఏటేట లక్షలు ఇచ్చుకొనుచున్నాము. మన దేశములో పత్తిపంట యెక్కువై విదేశములకు ఎగుమతి చేయుచున్నాము. కాని బట్టలు మాత్రము విదేశమువే ఎక్కువగా మనము కట్టుకొందుము. తిండికి గతిలేకున్నా మీసాలకు సంపంగినూనె పూసుకొన్నట్లుగా మనకు మందేశపు గుడ్డలు మోటు. విదేశీ రంగు రంగుల సన్నని మిల్లుబట్టలు అందము. తుదకు మన యిండ్లలోని పదార్థాలుకూడ మోటు కావచ్చినవి. జాం, బిస్కిట్, డబ్బాపండ్లు, డబ్బాపాలు, పెప్పర్‌మెంటు మున్నగునవి విదేశాలనుండి రాగా వాటిపై లక్షలు ఖర్చుపెట్టుచున్నాము. ఈ వ్యామోహాలు పోనంతవరకు మనము ముందుపడము. స్వరాజ్యము రానేరాదు. స్వరాజ్యము మాటలకు మంత్రాలకు, తాటాకుల చప్పుళ్ళకు మన చేతులలో వచ్చిపడదు.

ఔంధు రాజాగారు బెంగుళూరులో మన ఆర్థికాభివృద్ధికిగాను కొన్ని మంచి ఉపదేశాలను చేసినారు. వారిట్లు సెలవిచ్చినారు.

"వ్యాపారమంటే మూడుసూత్రాలలో ఇమిడియున్నది.

౧. నీ ముడిపదార్థాలను ఇతర దేశాలకు పంపవద్దు.

౨. ఇతర దేశాలలో సిద్ధమైన వస్తువులను కొనవద్దు.

౩. నీ దేశములో సిద్ధమైన వస్తువులను తప్పకుండా నీవే కొనవలెను."

ఈ మూడు సూత్రాలను ప్రతి భారతీయుడును ఆర్థిక గాయత్రివలె మననము చేయవలసియుండును. కేవల చింతనముతో ఏమియు లాభములేదు. ఆచరించవలసి యుండును. అయితే ఇందుకొక అక్షేపణముకలుగును- కొన్ని విదేశీవస్తువులు మనకుచాలా అవసరమగును. అవిలేనిది పని జరుగకపోవచ్చును. కంటిఅద్దాలు, కొన్ని గొప్ప ఔషధములు, కొన్నియంత్రాలు, ఇట్టివి మన దేశములో దొరకవు. అట్టివాటిని ఆపద్ధర్మమువలె అపవాదసూత్రమువలె విధాయకము లేనప్పుడు స్వీకరింపవచ్చును.

ఔంధు రాజుగారు మరొక ముఖ్యమగు విషయాన్ని సెలవిచ్చినారు.

"మన దేశములో సిద్ధమైన వస్తువుల కొనకుండా ఉండడము గొప్ప పాపము."

అని సెలవిచ్చినారు. ఇది అక్షరాలా నిజమే. మనము స్వదేశీవస్తువులను పరిహరించుటలో తప్పుచేసిన వారమేకాము మహాపాతకమునుగూడ చేసినవారమగుచున్నాము. మనము మన బీదసోదరులను నాశనము చేయుచున్నాము. రాట్నాలు మోటైనవి. మగ్గాలు మూలబడినవి. సాలెవారిప్పుడు చాలామంది కూలీలైనారు. మన దేశమందలి యంత్రాలలో సిద్ధమగు వస్తువులనుకూడ మనము కొనుటలేదు. ధనికులు, రాజులు, నవాబులు, శుభకార్యాలకుగాను, తమ వినోద విలాసాలకుగాను కోట్ల ద్రవ్యాన్ని విదేశీవస్తువులపై నాశనము చేయుచున్నారు. ఇట్లు చేయుటచేత మన బీదలకు కూడులేక గుడ్డలేక పనిలేక ఆదాయములేక వారుఆర్థికముగానేకాక నైతికముగాను పతితులైపోవుచున్నారు. దీనికి కారణము మనమే కనుక మనము చేయునది పాపపు కార్యమే అని అనక తప్పదు.

ఆర్థికాభివృద్ధితోబాటు గ్రామాల అభివృద్ధికూడ కలుగును. పూర్వమెన్ని రాజ్యాలు తలక్రిందైనను భారత దేశమందలి గ్రామాల ఆర్థికస్థితి చెడకుండెను. గ్రామాలలోని జనులు తినుటకు తిండి కట్టుటకు బట్ట కలవారైన ఆసంస్థానము నిశ్చయముగా ఉత్తమ సంస్థానమనవలెననియు, ఈ విధముగా గ్రామాలలోని జనులు సుఖులై యున్నారా అని విచారించుకొనుట ప్రభువుయొక్క ప్రథమకర్తవ్యమనియు ఔంధురాజులుంగారు తెలిపినారు.

ఔంధు రాజాగారి హితోపదేశమును భారతీయులందరును గమనింతురు గాక. దేశీయనాయకులును అందుముఖ్యముగా మహాత్మా గాంధీగారును ఈ ౨౦ ఏండ్లనుండి ఈ విషయములనే బోధించుచున్నారు. అయినను మనలో తగిన జాగృతికలుగక పోయెను. ఇట్టి విషయాలలో మాటిమాటికి ప్రజలకు ప్రబోధము కలిగించుట ప్రధానమని మనవి చేసుకొనుచున్నాము.

— —

## శ్రీ సుభాష్ చంద్రబోసుగారి అరెస్టు

## యుద్ధకాలపు కఠినచర్యలు

జూను ౨౮వతారీఖునుండి వచ్చినవార్తలలో దేశరక్షణ నియమాలక్రింద అరెస్టులు చాల అధికముగానున్నవి. అందును కమ్యూనిస్టుల నిర్బంధములు చాలఎక్కువగా నుండినవి.

లక్నో అమీనాబాదు పార్కులో యుద్ధ ప్రతికూలములైన ఉపన్యాసా లిచ్చుచున్నారను కారణముచెప్పి ముగ్గురిని హజ్రత్‌గంజ పోలీసులు అరెస్టుచేసినారు. అఖిలభారత కాంగ్రెసు పరిషత్తుసభ్యుడును ఒక జనపనారకూలీల సంఘాధ్యక్షుడునునగు దేవేంద్రనాథ సుకుల్‌గారిని ఆ కూలీల సంఘ కార్యాలయపు సోదాతర్వాత అరెస్టుచేసిరి. ఇట్లే ఘరియరపుర కాంగ్రెసువారలుకూడ అరెస్టుచేయబడిరి మరిహద్దురాష్ట్రములో ఉత్మంజాయ్ కాంగ్రెసుకమిటీ కార్యదర్శితోసహా నలుగురిని కరెన్సీనోట్లకు వ్యతిరేకప్రచారము చేసిరన్న కారణముతో అరెస్టుచేసినారు. కేరళరాష్ట్ర కాంగ్రెసుసభ్యుడగు ఇ. పి. గోపాలన్ పట్టాంబిలో అరెస్టుచేయబడెను

బోసుబాబు

జూను ౨౮వ తేది ఝాన్సీజిల్లా కాంగ్రెసుసంఘ కార్యాలయముయొక్క కార్యదర్శి నిత్యానందుగారును, మరియిరువురు కాంగ్రెసువారును అరెస్టుచేయబడిరి. బెంగాలు రాష్ట్రములో తిలఘరులో కూలీలకట్టును ఏర్పరచు సురేంద్రనాథ బోసుగారిని వేరెచోటికి వెళ్ళిపొమ్మని అజ్ఞాపించినను వారుపోనందున వారికి ౨నెలల కఠిన ఖైదుశిక్ష విధించబడెను, "యుద్ధమును గూర్చిన చిత్తుతీర్మానము, మనవిధి" అను కరపత్రములను, "రాంఘరు, దానితర్వాత" అను కరపత్రములను, ప్రచురించుటయు, అమ్ముటయు, పంచిపెట్టుటయు బెంగాలు ప్రభుత్వముచే నిషేధించబడినది. యుద్ధమునకు అప్పునివ్వవద్దని ప్రజలకు బోధించుచుండిన ముగ్గురు కిసాన్ ప్రచారకులు అరెస్టుచేయబడినారు. బెంగాలు రాష్ట్రములో ఆపివేయబడిన రాష్ట్రీయ కాంగ్రెసుసంఘాధ్యక్షుడగు రాజేంద్ర చంద్రదేవగారిని జూను ౨౯వ తేది ఉదయము పోలీసులు పట్టుకొనిపోయిరి. లక్నో పోలీసులు యుద్ధప్రతికూల ప్రచారము చేయుచున్నారని తమకుతోచిన యిరువురిని జూను ౨౭వ తేది పట్టుకొనిపోయిరి. బీహారు సోషలిస్టుపార్టీ కార్యదర్శికి శోరిప్రసన్న సింహాగారిని అరెస్టుచేసినారు. అరెస్టుకుముందు హాజీపూరులో గాంధి ఆశ్రమంలో వారిగదిని సోదాచేసి సోషలిజమును గూర్చిన కొన్ని పత్రాలను పట్టుకొనిపోయినారు. బీహారులో ఇదివరకు రాజకీయఖైదీగానుండిన చంద్రసింగుగారిని కలకత్తాలో అరెస్టుచేసినారు.

పంజాబులో చిక్కినవారలందరును కమ్యూనిస్టులే. మొత్తము ౨౧మంది జూను ౨౮వ తేది ఉదయము పట్టుకొనబడిరి. వీరలలో లాహోరుజిల్లా కాంగ్రెసుకమిటీ అధ్యక్షుడును, ప్రొఫెసర్ అబ్దుల్లాగారును గలరు. అమృతసరులో జూను ౨౭వతేదిరాత్రి ఇదివరలో మీరట్ కుట్రకేసు ఖైదీగానుండిన సర్దార్ సోహన్‌సింగున్ను మరి తొమ్మిదిమంది కమ్యూనిస్టులో కిసానులో పట్టుకొనబడిరి. పోలీసులు చాలాయిండ్లను సోదాచేసి కమ్యూనిజమును గూర్చిన వ్రాతలను పట్టుకొనిరి. మొత్తముపై జూను ౨౮వ తేదినాడు పంజాబు రాష్ట్రమందన్నిచోట్లను మొత్తము ౬౨ మంది అరెస్టుచేయబడిరి. అందులో నలుగురు పంజాబు అసెంబ్లీసభ్యులు. ఈ అరెస్టు చేయబడిన వారలలో సగముమంది విదేశములలో కమ్యూనిజం నేర్చుకొన్నవారని పంజాబు అధికారులు అనుచున్నారు. వీరలు ఈ దేశములో

శ్రీయుత సుభాష్ చంద్రబోసుగారు భారత దేశరక్ష నియమావళి ననుసరించి కలకత్తాలో వారియింటివద్ద జూలై ౨వ తేది నాడు అరెస్టుచేసినారు.

జనసామాన్యమందు అల్లరులను పురికొల్పి ప్రభుత్వములను కూలద్రోయుటకు యత్నాగములను పన్నుచున్నారని ప్రభుత్వమువారికి కనపడుచున్నదట. అరెస్టుచేయబడిన అసెంబ్లీసభ్యులు కాంగ్రెసుపార్టీకి చెందినవారలు. లూధియానలో ౨౭వ తేది ఉదయము పంజాబుఅసెంబ్లీ సభ్యుడగుచాచారూరీసింగ్, సర్దార్ హాజాన్‌సింగ్ హుందంగారలను అరెస్టుచేసిరి. లాహోరులో ౨౮వ తేది ఉదయము అరెస్టుచేయబడిన ఒకకమ్యూనిస్టు పోలీసుస్టేషను నుండి పారిపోయెను. కాన్పూరు మజ్దూరుసభ సభ్యుడగు రాజకిశోరునికి ఒకసంవత్సరము కఠిన కారాగారవాస శిక్షవిధించబడెను. మదరాసు ప్రభుత్వమువారుకూడా జూను ౨౯వ తేదినాడు గావించిన ఒకప్రకటనలో వెల్లూరుజెయిలులో వేరుగాఒకమూల ౧౨మంది నిర్బంధించబడియున్నారనియు, వారలు కమ్యూనిస్టులనియు, వారలు ప్రభుత్వమును కూలద్రోయ ప్రయత్నములుచేయుచున్నట్లు బయటపడినదనియు, అందుచేత నే నిర్బంధించబడినారనియు చెప్పబడినది.

జూను ౨౭వతేది బెంగాలు పోలీసులు; ఆపివేయబడిన బెంగాలు రాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యాలయమును సోదాచేసి ఆఫీసుసీలును తీసికొనిపోయిరి. మరియు కలకత్తాలో చాలాయిండ్లనుసోదాచేసి నలుగురు బెంగాలుయువకులను అరెస్టుచేసిరి, కొన్ని కాగితములను తీసికొనిపోయిరి బొంబాయిలో ఖుఫ్యాలు ౭ యిండ్లు సోదాచేసి కమ్యూనిజమునుగూర్చినకాగిదములను తీసికొనిపోయిరి. పంజాబు రాష్ట్రములోని జలంధరులో ఇరువురు సోషలిస్టులు క్రొత్తగాఅరెస్టుచేయబడిరి. కలకత్తా యలెక్ట్రిక్ సప్లయిపనివారల సంఘముయొక్క అధ్యక్షుడగు దేవేన్‌సేనుగారికి కఠిన కారాగారవాసము విధించబడెను. బెంగాలు రాష్ట్రము వదలిపోయిందను ఉత్తరువు సత్యచటర్జీగారికి అందజేయబడెను.

జూను ౨౯వ తేదినాడు పంజాబురాష్ట్రీయ కాంగ్రెసుసంఘము సమావేశమై పంజాబులో రాజకీయప్రచారసలనేతలను అరెస్టుచేసినందుకు నిరసన తెలుపు తీర్మానము నామోదించెను.

— —

## న్యాయశాఖామంత్రి పర్యటనము

హైదరాబాదు(సర్కారు), అమర్దాము ౨౪

గౌ॥ న్యాయశాఖామంత్రిగారగు సయ్యదు అబ్దులుఅజీజుగారి పర్యటనము ముగిసినది. వారు నిజామాబాదు జోగిపేట, మెదకు ప్రాంతాలు చూచివచ్చినారు. నిజామాబాదులో కోర్టులను చారిత్రక స్థలములు దర్శించిరి. మెదకుకోట్లలోని వకీల్లు మంత్రిగారికి సన్మానమర్పించిరి.

— —

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౨౭-౯-౪౯ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము. ధరలన్నీ హాలీలే.

| బియ్యము | పల్లా ౧కి ధర రూ | అ | పై |
|---|---|---|---|
| కిచిడీసాంబర్లు | ౨౧ | ౦ | ౦ |
| సంబర్లు | ౨౧ | ౪ | ౦ |
| ఢిల్లీభోగాలు | ౧౯ | ౦ | ౦ |
| రాంసాగర్లు | ౧౭ | ౦ | ౦ |
| నానక్రాం | ౨౦ | ౦ | ౦ |
| ఆర్కాటి | ౧౯ | ౦ | ౦ |
| సోనామణి | ౧౭ | ౦ | ౦ |
| బుడుములు | ౧౬ | ౦ | ౦ |
| జేశావరి | ౧౫ | ౭ | ౦ |
| గోధుమలు | | | |
| జన్సి | ౧౩ | ౪ | ౦ |
| అష్కరి | ౧౬ | ౭ | ౦ |
| పోటియా | ౧౬ | ౦ | ౦ |
| ఎర్రగోధుములు | ౧౪ | ౦ | ౦ |
| జొన్నలు | ౧౦ | ౦ | ౦ |
| తెల్లజొన్నలు | ౧౧ | ౦ | ౦ |
| పచ్చజొన్నలు | ౯ | ౧౦ | ౦ |
| మడికట్టుజొన్నలు | ౯ | ౦ | ౦ |
| శనగలు | ౧౩ | ౧౧ | ౦ |
| కందులు | ౯-౧౨-౦ నుంచి | | |
| | ౧౨-౦-౦ వరకు | | |
| మినుములు | ౧౬ | ౦ | ౦ |
| లంకలు | ౧౨, | ౧౨ | ౦ |
| సజ్జలు | ౧౧ | ౦ | ౦ |
| కుసుములు | ౩ | ౭ | ౦ |
| పప్పు | | | |
| సెనగపప్పు | ౧౭ | ౦ | ౦ |
| కంది ,, | ౧౬ | ౦ | ౦ |
| సిరిసెనగ ,, | ౨౩ | ౦ | ౦ |
| లంక ,, | ౧౫ | ౬ | ౦ |
| మినుప ,, | ౨౪ | ౦ | ౦ |
| పెసర ,, | ౨౩ నుంచి | | |
| | ౨౪ | ౭ వరకు | |
| బెల్లము | ౧౩ | ౦ | ౦ |
| ఉప్పు | ౧౨ | ౦ | ౦ |
| ఉల్లిగడ్డ | ౩ | ౦ | ౦ |
| మిరపపండు | ౨౫ నుంచి ౩౦ వరకు | | |
| చక్కెర మణుగు (౪౦ సే) | | | |
| జావా ,, ,, | ౧౭ | ౨ | ౦ |
| బొంబాయి ,, ,, | ౧౫ | ౭ | ౦ |
| మద్రాసు ,, ,, | ౧౫ | ౧౨ | ౦ |
| నిజామాబాదు ,, ,, | ౧౫ | ౧౦ | ౦ |
| ఎర్రచక్కెర ,, పల్ల | ౨౫ | ౨ | ౦ |
| దర్గాచక్కెర ,,(౪౦ సే) | ౧౬ | ౧౨ | ౦ |
| ఎల్లిగడ్డ ,౧౨సే | ౨ | ౭ | ౦ |
| అల్లం ,, ,, | ౨ | ౭ | ౦ |
| మణుగు ౧౨ సే | | | |
| కొబెన్నూరినూనె | ౪ | ౨ | ౦ |
| కుసుమనూనె ,, | ౩ | ౧౫ | ౦ |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౧౪ | ౦ |
| పుంటినూనె ,, | | | |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧కి | | | |
| తెల్లది ,, | ౪ | ౩ | ౦ |
| పచ్చది ,, | ౩ | ౯ | ౦ |
| నెయ్యి మణుగు ౪౦ సే | | | |
| బిదరునెయ్యి ,, ,, | ౪౫ | ౨ | ౦ |
| తెలంగానా ,, ,, | ౪౦ | ౦ | ౦ |
| వనస్పతి డబ్బా ౧కి ౧౧ | ౨ | ౦ | |
| బంగారు తు ౧కి | ౪౯ | ౦ | ౦ |
| వెండి ౧౦౦ తు | ౩౧ | ౦ | ౦ |
| తు ౧కి | ౦ | ౧౧ | ౬ |
| కవరిజ ౧కి కల్దారు రూ | ౩౦ | ౦ | ౦ |
| మారకం | | | |
| హాలికి కల్దార్లు | ౧౬ | ౫ | ౬ |
| కల్దారుకు హాలీలు | ౧౬ | ౩ | ౬ |
| ఆముదాలు బస్తా | ౧౨ | ౨ | ౦ |
| వేరుసెనగ | ౧౪ | ౧౦ | ౦ |
| బుడ్లు పల్లా ౧కి | ౧౨ | ౦ | ౦ |
| పప్పు పల్లా౧కి | ౧౨ | ౦ | ౦ |

గమనిక: —

౧. ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైనపొరపాట్లుండిన దానికి పత్రిక వారు బాధ్యులుకాజాలరు

౨. నగరాలలో జిల్లాలలో వ్యాపారపు కేంద్రాలలోని గొప్పవర్తకులు తమదుకాణముల ప్రకటనలు మాపత్రికలో వేసికొనిన వారి వ్యాపారానికి చాలా ప్రయోజనము కలుగును.

## ఆంధ్రమహాసభ - బాల్య వివాహ నిషేధము

సప్తమ ఆంధ్రమహాసభలో వేంకటరంగారెడ్డి గారి బాల్యవివాహ నిషేధ శాసనమును గురించి తీర్మానమును తెచ్చిరి. ఆతీర్మానాన్ని ప్రతిపాదించుటకై ప్రత్యేకముగా సురవరముప్రతాపరెడ్డిగారిని ఆదేపనిగా పిలిపించిరనియు వింటిని, తీర్మానముపై చర్చోపచర్చలు జరిగెను. ఓట్లు తీసుకొనగా అన్ని వేలమందికల సభలో ప్రతికూలముగా యిద్దరో ముగ్గురో అవగా ప్రతికూలముగామాట్లాడినవాళ్లే చేతులెత్తిరి దీనివలన తెలంగానాప్రజల అభిప్రాయము తెలిసిపోయినది. ఈసంగతి జరిగినప్పటినుండియు సికింద్రాబాదులో కొందరు సనాతనులు ఒకసంఘముగా ఏర్పడి కొందరు వైశ్యకు వేరులవద్ద ధనముప్రోగుచేసి ముగ్గురుప్రచారకులకుజీతములిచ్చి గ్రామాలలో ప్రచారము చేయించుచున్నారు. గ్రామజనులలో కొందర్నిసంతకాలుతీసికొని దేశమంతా మాసనాశ్రమమయ్యింగానేఉంది. అని ప్రచారము చేయుచున్నారు పైగా ఒకస్వాములవారు రెండుమూడు మాసాలనుండి హైద్రాబాదుసికింద్రాబాదులోనే కూర్చున్నారనియు ఉపన్యాసాలిచ్చుచున్నారనియు తెలియవచ్చుచున్నది. ఆంధ్ర మహాసభవారికి ప్రచారకులున్నారనుకొంటాము. వారేమి చేయుచున్నారు. ఏయేగ్రామాలలో సనాతనులు ప్రచారముచేసినారో అచ్చటికి తమ ప్రచారకులపంపి యథార్థమేమిటవరకో ఎందరుఅనుకూలురో ఎందరుప్రతికూలురో తెలుసుకొనుట బాగుండునేమో మరియు వారును తమతమజిల్లా తాలూకాసంఘాలనుండి సభలుచేయించి తీర్మానాలుకావించి ప్రభుత్వమువారికి పంపించుఏర్పాట్లు ఏల చేయరు. ఈకాలములో ఎక్కువ నోరు చేసుకొనువారిదే కాలమున్నట్లున్నది. ఊరకుంటే ఉత్తవాదు అనుకొనుఅపోహ ప్రబలిపోవును.

ఇట్లు
ఒక నిజమైన సనాతనుడు

## ఉస్మానియా విద్యాపీఠము సంవత్సరారంభము

సికింద్రాబాదు(దక్కన్)జూను౨౫

ఆచారప్రకారము ప్రతిసంవత్సరము ఉస్మానియా విద్యాపీఠపు కళాశాలలు ప్రారంభకాలమున ఉపాధ్యాయులు విద్యార్థులసభ చేయుటకలదు. అదేవిధముగా మొన్నటిదినము ఉస్మానియా కళాశాలలో సమావేశము జరిగినది. నవాబు మెహిదీయార్జంగు బహద్దరుగారు ప్రారంభోపన్యాసము గావించుచు నిట్లు సెలవిచ్చినారు. "ఈసంవత్సరము రెండు విషాదవిషయములు సంభవించినవి. మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దరుగారును లేడీహైదరీగారును మరణించినారు. వీరినిగురించి మనసానుభూతి ప్రకటించవలెను." అందరును రెండునిముషాలవరకు నిలిచి తీర్మానాలనుగావించిరి. తర్వాత నవాబుగారు ఉస్మానియావిద్యా పీఠాభివృద్ధినిగురించి సెలవిచ్చినారు ఈమధ్యన కొన్నిసంవత్సరాలనుండి బాలికలే యెక్కువబహుమానాలను తీసుకొనిపోవుచున్నారనియు, హాస్టల్ జీవనము విద్యార్థులకుచాలా భద్రమనియు ఈయేడు ఇంటర్ తరగతివారికి అట్టిసౌకర్యాలు కలిగించినామనియు విద్యార్థులందరునుచేరి క్రమముగా ఈపీఠాన్ని విద్యారసపీఠముగా మార్తురనియు తెలిపిరి. గతసంవత్సరము పీఠచరిత్రలో ఒకగొప్పశుభసమయము. మన్నప్రభువులుంగారు కళాశాలా ప్రారంభోత్సవమునుగావించిరి. అప్పుడుశ్రీవారు విద్యార్థులకును ఉపాధ్యాయులకును మంచి హితోపదేశము చేసియుండిరి, ఈసంవత్సరము "ప్రీ-హెచ్ డీ"తరగతికూడ ఏర్పాటుచేయబడినది. తుదిలో నవాబుగారు ప్రకృత యుద్ధాన్నిగురించియు శత్రువుల ఘోరాలనుగురించి ముచ్చటించిరి, అందరును బ్రిటిషుప్రభుత్వానికి సహాయముచేయవలెనని తెలిపిరి.

## ఆగమనము

హైదరాబాదు(దక్కన్), జూను౨౫

జనరల్ వాలాషాన్ నవాబ్ మొజంజాబహద్దరుగారును వారి సతీమణిగారును మసోరీను డి సోమవారమునాడు హైద్రాబాదుకు విచ్చేసిరి.

రై. అ సర్ అక్బర్ హైదరీగారు బొంబాయికిపోయియుండిరి. అచ్చటినుండి హైద్రాబాదుకు తిరిగివచ్చినారు.

## రైల్వే ఉద్యోగులసభ

యుద్ధసహాయార్థము

సికింద్రాబాదు (దక్కన్) ౨౫-జూను

ఈ దినము సికింద్రాబాదు రైల్వే ఆఫీసులో మేజర్ స్లాటర్ గారు రైల్వే ఉద్యోగుల నందరిని పిలిపించిప్రకృతయుద్ధ పరిస్థితులను గురించి, జనులతోట్పాటునుగురించియు నుపన్యసించిరి. ౨౦౦౦ కన్న ఎక్కువగా సభ్యులు సభకువిచ్చేసిరి. ఆసభలో వారిచ్చిన యుపన్యాస సారాంశమేమనగా:

ఈ రానున్న కొలదిమాసాలలో ప్రపంచస్థితి పరిష్కారమగును. ముందు చీకటివచ్చునో వెలుతురువచ్చునో నాగరికతో నిలుచునో మునిగిపోవునో అవియే మనమాలోచించవలసిన ప్రధాన్నాంశాలు. ప్రతివాడును ఈ సమయములో తన శక్తికొలది యుద్ధానికి చేయూతనొసగవలెను. బ్రిటిషుసామ్రాజ్యము అపజయముపొందితే హిందుస్థానముకూడ దానివల్ల బాధపడితీరును. ఇటీవలనే మ. ఘ. వ. నిజాముగారి ఫర్మానునిచ్చినారు తమరాష్ట్రముయొక్క సర్వస్వమును యుద్ధసహాయార్థము అర్పించుటకు సంసిద్ధులమన్నారు.

యుద్ధప్రారంభదశలో యుద్ధసామగ్రికి ఆర్డర్లు వస్తూవుండెను. తర్వాత ౧ లక్ష రూపాయల సరకును గాను ఆజ్ఞయిచ్చిరి. అవియు పూర్తికావచ్చినవి. ఇప్పుడు రైల్వే కర్మాగారాలన్నిటిని యుద్ధసామగ్రికిగాను ఇయ్యవలసినదని ఇండియాప్రభుత్వమువారు అడిగినారు. ఇంతలో రైల్వేకర్మాగారాలన్నీ దినమూ ౨౪ గంటలు పనిచేయుచుండగలవు. అందుకుగాను పనిలో కుశలులగువారికి చాలా పనికలుగును. ఇదివరలో సామానులను సిద్ధముచేసినవారిపనిని లోకో అధికారి చాలా మెచ్చుకున్నాడు. ఇక ముందును ఇట్టిపనులు ఇంకా బాగా జరుగుననియు అదేవిధంగా డ్రైవర్లుకూడా మంచిపనిచేసినారు. వారు డ్రైవర్లను బాగా సిద్ధము చేసినారు. ఇంకను అట్టివారు కావలెనని ప్రభుత్వమువారు అడుగుచున్నారు.

అదేవిధంగా విమానాలు నడుపువారిని హైదరాబాదు ప్రభుత్వమువారు తర్బీయతు చేయగలరా అని ఇండియాప్రభుత్వమువారు విచారించినారు? అట్లు సిద్ధపరచి వైమానికులనుయుద్ధసహాయానికియ్యవలసియుండును. హైద్రాబాదు ప్రభుత్వమువారు అట్టి వైమానికులను సిద్ధముచేసి యిత్తుమన్నారు. మరియు ౧౦౦ మంది మెకానికులు కావలెను. వీరినికూడ తమఖర్చుతోనే సిద్ధముచేసి యిత్తుమని హైద్రాబాదు ప్రభుత్వమువారంగీకరించినారు. ఐతే చికిత్సాశాఖము (అంబులెన్సుకు)నకుగాను స్త్రీలు కావలెసినంతమంది రాలేదు.

రైల్వేఉద్యోగుల భార్యలు యుద్ధనిధికి, మంచిసహాయము చేసినారు. పైగా వీరు జర్మనుల అబద్ధపుప్రచారాలను ఎదుర్కొని జనులలో సత్యమైనవార్తల ప్రచారము చేయవలెను. జర్మనులు అన్నిదేశాలలో రహస్యప్రచారకులనుంచి అల్లకల్లోలాలు చేయుచున్నారు. కనిష్ఠము ఈ రెండుమాసాలలోనైనా ప్రతివాడును ద్రవ్యమును ప్రోగుచేయుటలో సహాయపడవలెను. ఇకముందు ప్రతివారమున్ను జరిగే ప్రయత్నాలనుగురించి యుద్ధవార్తలనుగురించి కరపత్రాలు రైల్వేవారికందరికిని పంచిపెట్టబడును. రేడియోలుకూడా రైల్వేలైనులలో నుంచబడును. ఈ యుద్ధములో పాల్గొనుటకు మంది అంతగా అవసరములేదు. యుద్ధసామగ్రియే చాలా కావలెను నేను చెప్పుమాటలను చులకనగా చూడవద్దు. ఈ రెండునెలలు మీరు మీమీ మాలిపనులను తగ్గించుకొని ఏదేకధ్యానముతో పనిచేయుండి ఇతరులు స్వాతంత్ర్యమును రక్షించుకొనుటకై ప్రాణాలే యిస్తూఉండగా ఇంత మాత్రము సహాయము మీరు చేయలేరా? ఇంతలో ఒకలక్షరూపాయిలు సమకూర్చితే ఒక యుద్ధవిమానము సిద్ధముచేయవచ్చును.



## ప్రాంతపు [illegible]

సికింద్రాబాదు (దక్కన్) జూను౨౫

[illegible] కొందరువ్యక్తులు టపాప్రాంతపులను విదేశీప్రచురణలకు అమ్ముచున్నారని తెలిసినది. అది శాసనవిరుద్ధము. అట్లుచేసిన శిక్షకు పాత్రులగుదురని సికింద్రాబాదు అధికారులు వారికి తెలిపినారు.

## హుసేనుసాగరులో పడవ బోర్లగిల్లుట

సికింద్రాబాదు(దక్కన్) జూను౨౫

విలాసార్థముగా ఇద్దరు మిలిటరీఅధికారులు ఒక పడవనడుపువానిని వెంబడించుకొని గతగురువారమునాడు హుసేనుసాగరు చెరువులో పడవలోపోవుచుండగా పడవ అకస్మాత్తుగా బోరగిలపడెను. వారిలో ఇద్దరు కష్టపడి యీదుకుంటూ గట్టుచేరుకున్నారు తక్కినవారిని మరొకపడవ తీసుకొనిపోయి రక్షించినారు.

## బిదరు ఖూనీవిచారణ

బస్వంతర్రావు అనువకీలును బిదరు అల్లరులసందర్భములో కొందరు చంపియుండిరను నేరములో వారివిచారణ బిదరుకోర్టులో జరుగుచున్నది. ౧౯ ఆర్దిబెహెష్తునాడు విచారణజరిగెను. పోలీసువారిసాక్ష్యము అయినది. నిందితులపక్షాన సాక్ష్యములుప్రారంభమైనవి బస్సప్పఅను ఒకరైతు సాక్ష్యమిచ్చెను. అల్లరివాడు యాఖూబ్ అను నిందితుడు ఒకబండికై గోపాలపల్లిఅను గ్రామానికి పోయియుండెనని చెప్పెను. మహమ్మద్ సిద్దీఖ్ అను ఒక కోకసాక్షిసనవద్ద అనాడు నిందితుడగు యాఖూబు ౧౪౦ రూపాయిలు బాకీతీసుకొనెననియు దానితో ౨౪౦ బిగాలచొప్పు ఖరీదుచేసెననియు తర్వాత నేరుగాయింటికిపోయెననియుచెప్పెను. విచారణ యింకను జరుగుచున్నది.

## ఆంధ్రమహాసభ—కార్యకారిణీసంఘసభ్యుడు

హైదరాబాదు(దక్కన్), అమర్దాదు ౨౩

ఆంధ్రమహాసభాకార్యకారిణీసంఘసభ్యుడొకడు తక్కువగానుండెను దానిని మొన్న మొన్న నేపూరించియుండిరి. ఆసభ్యులుగారునల్లగొండవకీలు గారగు శ్రీ. వేంకటరామారావుగారు కావున ఈవేంకటరామారావుగారు నల్లగొండవకీలుగారే-అని ఒకరుమాకు తెలుపుచున్నారు.

## వరంగల్లు జిల్లా ఆంధ్రజనసంఘ సమావేశము

జమాబంది మురాఫాల సౌకర్యముల కేర్పాట్లు

వరంగల్లు, అమర్దాదు ౨౩

వరంగల్లుజిల్లాఆంధ్రజనసంఘము నేడుశుక్రవారము సమావేశమై ఈక్రిందివిషయములను ఆమోదించెను:—

౧. అధ్యక్షుడు శ్రీయుతజమలాపురం కేశవరావుగారిని ఉపాధ్యక్షులుగాను, శ్రీయుత ఆ౦౦చవేంకటరావుగారిని కార్యదర్శులుగాను ఎన్నుకొనెను.

౨. పాల్వంచతాలూకాజాగీరునకు ఇదివరకు ప్రాతినిధ్యములేదు గాన శ్రీయుతులు చందాలకృష్ణయ్య, మాజేటి.రామారావుగాలును తాలూకాసభ్యులుగాను, శ్రీయుత వనం వెంకట నర్సింహారావుగారిని సమస్తాన్ పాల్వంచ(మంగపేటకు) ప్రతినిధిగాను ఎన్నుకొనబడిరి.

౩. ఇదివరకు నియమింపబడి, స్థాయిసంఘము వారిచే నంగీకృతమై పనిచేయుచున్న జిల్లా సంఘమునకు మారుగా ప్రస్తుతము వెంకటాయపాలెము జిల్లాఆంధ్రమహాసభలో నెన్నుకొనబడిన జిల్లాసంఘమును గుర్తించుటకు స్థాయిసంఘమునకు విన్నవించుకొనవలెను.

౪. ప్రతితాలూకాలోను తాలూకా సంఘముల నేర్పాటుజేసి, జిల్లా సంఘనిధికిగాను కనీసము రు. ౧౦౦ లు విరాళముజిల్లా సంఘమునకు బంపుటకు ఆయాతాలూకా సంఘసభ్యులు వినయపూర్వకముగా గోరబడుచున్నారు. వచ్చేసభలోగా ఈపని పూర్తికావడము అవసరము.

౫. జిల్లాసంఘ నియమములను తయారుచేయుటకు క్రిందిసభ్యులుగల ఉపసంఘము ఏర్పాటు చేయబడినది:—

(౧) శ్రీయుత ఉదయరాజు వెంకటరంగారావుగారు.
(౨) ,, ఆవంచ వెంకటరావుగారు కార్యదర్శి.
(౩) ,, కాళోజి రామేశ్వరరావుగారు స. కార్యదర్శి.
(౪) ,, నారాయణరావుగారు, స. కార్యదర్శి
(౫) ,, పరచ రంగారావుగారు అధ్యక్షుడు.

వచ్చేసభలోగా నియమము లనసిద్ధము జేసి ఆసభలో ప్రవేశపెట్టుటకు ఈఉపసంఘము ను వేడుకొనవలెనది.

౬. స్థాయిసంఘమువారు సూచించిన యాత్రమునకు లోబడి ఈజిల్లాలోని బీదరైతులు జమాబంది మురాఫాలలో ఉచితముగా న్యాయవాదులసహాయమునుమాత్రము కోరిన పక్షమున జిల్లాసంఘమునుండి ఉచిత సహాయమునకు క్రిందివిధముగా నేర్పాటు చేయవలెనన్నది:—

(౧) ఖమ్మంమెట్టుడివిజన్ మురాఫాలు శ్రీయుతులు ఆవంచ వెంకటరావు, మాదిరాజు సీతారామరావుగారలు చూచుకొందురు.

(౨) మహబూబాబాదు డివిజన్ మురాఫాలు పరచ రంగారావుగారు అధ్యక్షుడు చూచును.

(౩) వరంగల్లుడివిజన్ మురాఫాలు శ్రీయుతులు కాళోజి రామేశ్వరరావు, నారాయణరావుగారలు చూచుకొందురు.

రైతులకు పైసలపట్టుకనకష్టు ఇప్పించుట మొదలగు సౌకర్యముల గలుగజేయుటకు తాలూకా సంఘసభ్యులు గోరబడిరి.

౭. బాల్యవివాహ నిషేధశాసనమునకు అనుకూలముగా మల్కాపురం ఆంధ్రమహాసభలో నామోదింపబడిన తీర్మానమునకు అనుకూలముగా బహుజనాభిప్రాయము ననుసరించి జిల్లాసంఘము తనఅనుకూలాభిప్రాయమును శాసననిర్మాణసభకు తెలుపుటకు అవకాశమీయనైనది.

౮. పద్మశాలీయమహాసభలో నిటీవల తీర్మానింపబడినవిధముగా పెట్టిచాకిరి, మగ్గముల పన్ను గురించి పద్మశాలీయులకు కలయిబ్బందులను విచారించి తెలుపుటకు ఆయా తాలూకాల ప్రతినిధులను గోరనైనది.

౯. హరిజనసేవయేకాక వెట్టిచాకిరివిషయములోను అనవరతము పాటుపడుచుండి, రైతుసంఘోద్ధరణమునకై శ్రమపడుచుండిన యువకులు శాఖమూడి వీరరాఘవయ్య చౌదరి (చినకోమల తాలూకా ఖమ్మంమెట్టు) గారి యకాలమరణమునకు ఈసభవారు తమ విచారమును తెలుపుచు వారియాత్మకు శాంతిని సంగుగాతయని భగవంతుని ప్రార్థించుచున్నారు

టీ. శే. ల కుటుంబమునకు ఈ అభిశంసన తీర్మానమును తెలుపుటకు కార్యదర్శిగారు కోరబడిరి

నిండు ఆదరాభిమానములతో నేటిసభ నావ్యానించి సభ్యులందరికు అతిథ్యమొసంగిన శ్రీయుత ఉదయరాజు వెంకటరంగారావుగారికి హృదయపూర్వకముగా కృతజ్ఞతావందనముల నర్పించుచు సభను సమాప్తి జేయనైనది.

ఉదయం ౧౧ గంటలకు సభఆరంభమై ౨ గంటలకు ముగిసెను

## కరీంనగరములో పందు ప్రేలుడు

ఒకరు పట్టుకొనబడుట

కరీంనగరం, అమర్దాదు ౨౪

కరీంనగరంలో అమర్దాదు౨౦వతేదీనాడు ఒక ఇంటిలో ప్రేలుడుమందు నూరుచుండగా దానిలో నిప్పుఅంటుకొని పెద్దధ్వని వెలువడినట్లును నూరినవానికి గాయాలైనట్లును పోలీసువారి పరిశోధనలో తెలిసినది. గాయపడినవానిని వైద్యశాలలో చేర్చిరి.

# ఎగుమతి దిగుమతులకు నిషిద్ధరాజ్యాలు

**ఇండియాప్రభుత్వమువారి ఉత్తరువులు**

సిమ్లా, జూను ౨౮

బ్రిటిషుఇండియాలో శత్రుదేశములో రిజిస్టరుకాబడిన వ్యాపారసంస్థలకుచెందిన చరస్థిరాస్తులు అన్నియు బ్రిటిషుఇండియాలోని శత్రుఆస్తిరక్షకుని స్వాధీనమునకుండును. ఆయన తన అధికారాలను ఆయాశాఖల మేనేజరులకు ఒప్పగించవచ్చునని తెలుపబడినది. సిమ్లాలో ఇద్దరి బొంబాయిలో ఒకరి ఇటాలియను వర్తకులఆస్తి శత్రుఆస్తిరక్షకునికి స్వాధీనపరచబడినదని తెలుపబడినది.

**ఇటాలియను నావలలోని సరకు నిషేధము**

రేవుపట్టణములలో శరణుజొచ్చిన ఇటాలీయ నావలలో ౧౯౪౦ జూన్ ౧౧తర్వాతనుండిన సరకును దేనినికూడ సముద్రముమీదుగాగాని నేలమీదుగాగాని బ్రిటిషిండియాలోనికి తేకూడదని ఇండియాప్రభుత్వము నిషేధించినది. శత్రుదేశమున ఉత్పత్తిఅయినదిగాని శత్రువుకుచెందినదిగానైన సరకును సముద్రముమీదుగా గాని నేలమీదుగాగాని బ్రిటిషిండియాలోనికి ప్రత్యేకానుమతిలేనిది తేకూడదని ఉత్తరువుచేయబడినది.

**ఎగుమతుల నిషేధము**

ఇండియాప్రభుత్వపు వాణిజ్యశాఖవారి ప్రత్యేకానుమతి పొందనగాని మేగ౨౪నాటి ప్రకటనలో తెలిపిన సరకుగాక ఇతరసరకును దేనిని బల్గేరియా, గ్రీసు, హంగరీ, రుమేనియా, యుగోస్లోవియా, స్విడ్జర్లెండు, లిక్టెనుస్టీనుకుగాని, నల్లసముద్రములోని రష్యారేవులకుగాని యూరపులో ఫ్రెంచిభాగమునకుగాని ఎగుమతిచేయగూడదని ఇండియాప్రభుత్వము నిషేధించినది.

**విదేశాల మారకపుపత్రాలు**

ఉత్తరువులో తెలుపబడిన విదేశాలమారక పత్రములను రిజర్వుబాంకుకు వాపసుచేయవలెననిగాని, వాటివివరములు తెలుపవలెననిగాని ఉత్తరువుచేయవచ్చును.

**బ్రిటనునుండి యంత్రపుపనిముట్లురావు**

రక్షణకార్యములకుతప్ప ఇతరపనులకు బ్రిటనునుండి ఇండియాకు యంత్రపుపనిముట్లు చాలామాసములవరకు పంపనీలుండదని బ్రిటిషు సరఫరామంత్రివర్గము తెలిపినది. యుద్ధసరఫరాబోర్డు సిఫారసు లేనిదే యంత్రపుపనిముట్ల ఉత్తరువులు ఆలోచించబడవు- అని తెలుపబడినది. అవసరమయితే సరఫరాశాఖకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును. అత్యవసరమైతేతప్ప వారు సిఫారసు చేయరు.

**నావవిషయమున చర్య**

నౌకారక్షణముకొరకుగాని, యుద్ధముచక్కగా సాగించుటకొరకుగాని,అవసరమనితోచుచో బ్రిటిషిండియాలో రిజిస్టరుఅయిన ఏనావనుగాని నిర్ణీతస్థలమునుండి వెళ్ళిపోవలసినదనిగాని లేక ఫలానిస్థలానికి పోగూడదనిగాని ఇండియాప్రభుత్వము ఉత్తరువుచేయవచ్చును, అట్టిఉత్తరువును ఉల్లంఘించినట్లయిన నావకెప్తానుకు దానియజమానుడుగానట్టి వ్యవహర్తకు అయిదుసంవత్సరములకు మించనిశిక్షయు జుర్మానకూడ విధించవచ్చును.

**సైన్యముల విషయమున ఉత్తరువులు**

ఇండియన్ టెరిటోరియల్ ఫోర్సులో భాగమైన ౫౪వ (మద్రాసు) ఏపటాలము ౧౯౪౦ జూలైనుండి రాజాగారిసైన్యములను బలపరచి అనుబంధముగా నుండునట్లు చేయబడినది.

---

## చెవుడు

శాస్త్రీక్తమైన అద్భుత ఔషధము

మా "బధిరతాహర్ణ" నూనె చెవులకుసంబంధించిన చీముకారుట, కట్టినట్లుండుట, ధ్వనులు, దురద, లోనిపొరలుచెడుట,చెవుడు, పూర్తిగాగాని, కొంతగాని, జలుబు, జ్వరము, క్వయినా అధికముగావాడుటవల్ల చెముడు, మొదలగువాటికన్నిటికి త్వరలో గుణమిచ్చును. వెయ్యిలమంది దీనినివాడి అద్భుతమైన గుణమును పొందియున్నారు గుణములేనిచో పైకమువాపసు యివ్వబడును. రు 2/-

ఆరోగ్యసదన్
దుర్గాదేవిస్ట్రీట్-బొంబాయి 4.

---

# గోలకొండ గ్రంథాలయము

## ఏకావళి

కవి. వేలూరి శివరామశాస్త్రిగారు
వెల ౧-౭ అణాలు పుటలు ౧౧౧
దొరకుస్థలము. కవిగారు నూజవరము అత్తూరుటప్పా కృష్ణాజి.

గ్రంథము ఆకర్షణీయముగా ఉన్నది. మంచి కాగితాలు. మంచిఅచ్చు. తప్పులులేవు.

కవిత ౧౯౧౧నుండి ౧౯౩౯వరకు అనగా ఇంచుమించు తెంబడేండ్లకాలములో కవిగారు వ్రాసిన ఖండపద్యాలు ఒకచోచేర్చి ముద్రించినారు. గ్రంథముపేరు కొందరికి విచిత్రముగా కనబడవచ్చును. సంపుటములో రెండు గ్రంథాలీపేరునకలవు. అయినా వాటికిని దీనికిని సంబంధములేదు, కవితయంతయు గ్రాంథికము. ఛందోబద్ధము. భాష సాధారణముగా గ్రాహ్యమగునదిగానే యున్నను అచ్చటచ్చట కవిగారు తమకు సహజమగు చెణుకులను విడిచినారు. అపూర్వపదాలను కొన్నింటిని ప్రయోగించినారు. భావాలు నూతనముగా నున్నవి. మంచి అపూర్వకల్పనలు. శైలి ధారాళముగా నడిచినది. "ఆంధ్రుడా" అను దాని పద్యాలు మా నిజామాంధ్రుల నుద్దేశించి వ్రాసిరో యేమోఅని భ్రమింపజేయునట్టిది,

"తెలివికి సంస్కృతమున్ మరి
కలిమికి నాంగ్లేయమో యికందురకంబో
విలుకయిడి నేర్చి యూనీ
తెలుగెవ్వరి పాలుచేసి తిరిగెద వాంధ్రా"

అని నిజాంరాష్ట్రి నాయకులను రాష్ట్రి సోదరాంధ్రుల నడుగుచున్నారు. "మాతృ హృదయము", "దేవాలయప్రవేశము" ధ్వని ప్రధానమై నట్టిభాగాలు. "సత్యప్రతిజ్ఞ" "కుట్ర," చారిత్రిక ఘట్టాలు, ఇంకాఇట్టివి బహుళముగా వ్రాసిన ఆనందింతుముకదా యని యనిపించును. మొత్తానికి ఒకటిబాగు. ఒకటి నీరసముఅనుటకు వీలులేని కవిత. కవి - రినిగురించియు వారి కవితనుగురించియు ఎక్కువగా వ్రాయవలసిన అవసరముకూడ లేదు. వారు సుప్రసిద్ధులు. ఆధునికాంధ్ర వాఙ్మయములో వారికి ముఖ్యస్థానముకలదు.

## శ్రీసావిత్రీనాటకము

కవి. శ్రీరాములసచ్చిదానందశాస్త్రిగారు
పుటలు— ౧౧౨
వెల. రు ౧-౦-౦
దొరకుచోటు — గ్రంథకర్త, శ్రీసావిత్రీ గ్రంథమండలి, పూర్ణానందపేట, బెజవాడ.

ఈకవిగారు జగమెరింగినబ్రాహ్మణులు. నాటకము బెజవాడలోని మైలవరం కంపెనీవారిచే ప్రదర్శితమై ప్రఖ్యాతికెక్కినటువంటిది. ఇట్టిపరిస్థితులలో కవిగారినిగురించికాని. నాటకమునుగూర్చిగాని ఎక్కువగావ్రాసి ఆంధ్ర దేశీయులకు పరిచయముచేయుట అనవసరము.

ఈనాటకము ఇరువది సంవత్సరములక్రిందట రచింపబడినది. ఈ యిరువది సంవత్సరముల నుండియు నాటకరంగమున ఖేలనభాగ్యమును పొందుచున్నది. ప్రజామోదమునుబొందిన యీ నాటకము కొంతకాలమునకు ముద్రితమైనది. ఇప్పుడు మాకార్యాలయమును నలంకరించినది. ఏపదమూర్పుదియనినచో ఈ నాటకము యొక్క యోగ్యత వెల్లడికాగలదు.

కథ మహాసాధ్వియొక్క చారిత్రము. రచయితలు భావనాపటిమ, కవితాశక్తి, పాండితీ విభవము గలవారలు. చక్కనిశైలి. సంభాషణాచాతుర్యము, పాత్రపోషణము మొదలగు నన్నివిషయములందు అందచందములతో నొప్పారుచున్న యీగ్రంథము నందరి నాటి యానందింతురుగాక!

కవిగారి శైలిని తెలియుటకై యుదాహరణముగా నొకపద్యము:—

"పక్వమై జారిపడుతేనె పనసపొనలు
వృంతముల ప్రీలి రాలెడు వెలగపండు
దొరలిపొరలాడు పోకపొత్తులనుజూడ
బుడుకకాకైన గాలంబు గడుచునిందు"

## హంసరాజు రాటము పోయింది

పంజాబురాష్ట్రములో హంసరాజు అనునతడు ఒక క్రొత్తవిధమైన రాటము కనిపెట్టినాడు. అది ఏకుతుంది, వడుకుతుంది. ఒక సేరుఏకులను దానిపై ఎనిమిదిగంటలలో వడుకవచ్చును. ఈ మేలైనకొత్తనమూనా రాటాన్ని మహాత్మాగాంధిగారికి చూపించుటకై వర్ధాకు ప్రయాణమైనాడు. రైలుప్రయాణం చేస్తుండగా అహమదాబాదుకున్ను అగ్రాకున్ను మధ్యనుండే రైలుస్టేషనులలో ఎక్కడనో ఎవ్వరో ఆరాటాన్ని దొంగిలించుకొని వెళ్ళిపోయినారట, తర్వాత పోలీసువారు దొంగజాడతీసినారు. దొంగ దొరికినాడు. జోద్పూరు ఇలాఖాలో దొరికినందున అచ్చట కోర్టువిచారణ జరుగుచున్నది. రాటముమాత్రము విచారణ పూర్తిఅయ్యేవరకు కోర్టువారు ఇయ్యమన్నారు.

---

## ప్రకటన

ఇస్తెహారు మహకమె నిజామత్
ఆబ్కారిముల్కి సర్కారి ఆలి

అమదనిసేంది జాగీరాతు, మఖ్తజాత్ యొక్క ఖిస్తు సెహామహి సువ్వం సన్ ౧౩౪౯ ఫసలీ చెరబాల తారీఖు ౫వ షహరేవర్ నుంచి తా॥ ౯వ షహరేవర్ సన్ ౧౩౪౯ ఫసలీ వరకు మొదటిసారి, తా॥ ౨౫వ షహరేవర్ సన్ ౧౩౪౯ ఫసలీకి రెండవసారి, మరియు తా॥ ౯వ మెహర్ సన్ ౧౩౪౯ ఫసలీకి మూడవసారి ఈ మహకమాలో దఫ్తర్ సైములలో తఖ్సీంకాగలవు. జుంమ్లా జాగీరుదార్లు, మఖ్తాదార్లు, మొఖ్రరరా తారీఖులలో చక్కు తీసుకునే ఇంతెజాం చేయగలరు ఈతారీఖులలో చక్కులుతీసుకోని ఎడల అటువంటి చక్కులను సెహామాహి చహారుం సన్ ౧౩౪౯ ఫసలి ఖిస్తువెంబడి యివ్వబడును, ఫఖత్.

ఇజ్లాసు తజ్వీజు ప్రకారం
మదద్గార్ నాజం ఆబ్కారి,

---

పాండురంగ
## బ్రాహ్మీ తలనూనె
ట్రేడ్ P మార్కు

యీతలనూనె 21 వనమూలికలతో శాస్త్రోక్తముగా తయారుచేయబడి శరీరమునకు, మెదడునకు చల్లదనమునిచ్చి శిరోజములను వృద్ధిజేయును, మనోహరమైన సువాసనను గల్గియున్నది. యీ సుప్రసిద్ధతైలము లోకవ్యాప్తిజెంది అనేక యోగ్యతాపత్రములను బొందియున్నది.

మావద్ద ఉసిరికనూనె, మసాలనూనె, నవరత్ననూనె వగైరాలు సర్వదా లభింపగలవు.

స్టాకిస్టులు:-కింగ్ అండ్ కో., స్టేషన్ రోడ్, హైదరాబాదు దక్కన్.
పాండురంగ ప్రాడక్ట్సు, నాడి-జంక్షన్.

---

వైవాహిక వింతసుఖముల అనుభవము

మీరు యౌవనమును, మంచి ఆరోగ్యమును కల్గియున్ననేగాని ఆనందదాయకము కాదు, కాని మీరు అకాలవార్ధక్యమునంది వీర్యపటుత్వమును గోల్పోయి, యితరదుర్గుణములచే నిరుత్సాహవంతులైయున్నప్పుడు, నూతనచికిత్సావిధానము లేదియును

## జిన్సిన్‌గోల్డ్ టానిక్‌పిల్స్

వలె పనియివ్వజాలవని నూఢిగా తెలుసుకొనగలరు. ప్రపంచమందలి మేలైనవాజీకర ఔషధములన్నియు యిందుకలిసియున్నవి. యౌవనమును ప్రసాదించుటయందు అద్భుతశక్తికి ప్రఖ్యాతినందియున్నది.

జిన్‌సిన్ మాత్రలన్నిటియందు జీర్ణము కాగల్గినంత స్వచ్ఛమైనబంగారమున్నదని దానిపై కప్పబడియుండు రేకు 100% బంగారమనియు పూచీయివ్వబడును.

ఈరోజే ఒక జిన్‌సిన్ సీసాకొరకు ఆర్డరుయిచ్చి దానివలన మీయౌవనము నకెట్టి తేజముగల్గునో గమనింపుడు. జిన్‌సిన్ పద్ధతి ప్రకృతిసిద్ధమైనదియు, శాశ్వతమైనదియునై యున్నది.

వెల 1సీసా రు4/- వి.పి. చార్జీలు వేరు. వెల 2సీసాలు రు 8/- వి.పి.చార్జీలుఉచితము.

**ఉచితము!** శరీర ఆరోగ్యమునకు సంబంధించిన విషయములన్నియు చిత్రపటములతో సహా పొందుపరుపబడిన మా 44 పేజల క్యాటలాగున్నూ, మీస్వంతభాషలో కొక్ కాటలాగున్నూ, మాకువ్రాసినవెంటనే ఉచితముగా పంపబడును.

16 సి. యం యస్. ప్రక్రియలు పూర్తివివరములతో వ్రాయబడినవి.

సి. యం. యస్. ఔషదములన్నియు క్రొత్తవి సీలువేసి బాగుగా ప్యాకింగు చేయబడిన స్థితిలో మానాల్ సెల్లింగు ఏజెంట్లవద్దనున్న ధరలపట్టీలననుసరించి అమ్మబడును.

| | |
|---|---|
| జే. బాలాభాయ్ అండ్ కో., 260, చైనాబజారు రోడ్, మదరాసు. | ప్రాన్‌లాల్ అండ్ సన్సు, 51, అర్కాటు శ్రీనివాసాచార్ స్ట్రీటు:- బెంగుళూరు సిటీ. |

హైదరాబాదు & సికింద్రాబాదు: డి. జె. వాకెఫ్ అండ్ కో.,

లేక

## చైనీస్ మెడికల్ స్టోర్ (స్థాపితము 1930)

హెడ్ ఆఫీసు:-28, అపోలోస్ట్రీట్, ఫోర్టు, బొంబాయి,

బ్రాంచీలు:— అహమ్మదాబాదు, ఢిల్లీ, & కలకత్తా.

---

## సెంట్రల్ బ్యాంకు ఆఫ్ యిండియా లిమిటెడ్

స్థాపితము—డిశంబరు 1911.

అధికార మూలధనము రు. 3, 50, 00, 000 — [illegible] మూలధనము రు. 3, 36, ౫౬. 40
చెల్లించిన మూలధనము రు. 1, 68, 13, 200 — [illegible]
31 12 [illegible] నిలువ రు. 31, 03, 09, 000 — యితర నిధులు రు. 101, 47, 000

హెడ్డాఫీసు:-ఎస్ప్లనేడ్ రోడ్, ఫోర్టు బొంబాయి.
103, బ్రాంచీలు, [illegible]

డైరక్టర్లు:-సర్ [illegible]
ది రైట్ ఆనరబుల్ నవాబు సర్ అక్బర్ హైదరి, కెటి. సి. ఇ.
ఆర్దిషిర్ బి. దుబాష్ గారు — [illegible]
డిన్షా డి. రోమర్ గారు — [illegible]
సర్ దోస్‌భాయి [illegible]
నూర్ మహమ్మదు [illegible]
బాపుజీ డి. [illegible]
[illegible]

లండన్ ఏజంట్లు:- [illegible] బ్యాంకు లిమిటెడ్. మరియు [illegible] బ్యాంకు [illegible]
న్యూయార్కు- మరియు [illegible] ఆఫ్ న్యూయార్కు-
బెర్లిన్ ఏజంట్లు:- ది డ్యూష్ [illegible] బ్యాంకు
అన్ని రకములైన బ్యాంకు వ్యవహారములు [illegible] వివరములు వ్రాసి బడయగలరు
[illegible] మేనేజరు.

---

# తామెప్పుడైన హైదరాబాదునకువేంచేసినచో నాంపల్లి రాయల్‌హోటల్‌ను మరువకుడు [ఫోన్ నెం. ౩౮౬౭] అక్కడ ఉత్తమమైన ఏర్పాట్లు గలవు.

Khan and sons

# బ్రిటను విజయసాధనములు

## నాజీ విచ్ఛేదమార్గములు

(మేజరు జెనరలు సర్ చార్లుస్గ్వీన్ గారు)

బ్రిటిషుసామ్రాజ్యమిప్పుడు నియంతృరాజ్యాలతో ఒంటరిగా పోట్లాడవలసి వచ్చినది. నియంతలాక్రమించిన దేశాల సైన్యములు మిగిలినవిచే యుసహాయముమాత్రము కొంతరావచ్చును. కొన్ని సందర్భములలో ఆ సహాయ మత్యంత ప్రయోజనకారిగ నుండవచ్చును. కాని ప్రస్తుతము దానిని లెక్కలోనికి దీసుకొనకుండ పరిస్థితు లేవిధముగ నుండునో పరిశీలించెదము.

బ్రిటిషు కామను వెల్తు పరిస్థితి యే విధముగా నున్నది? యుద్ధములో ముఖ్యమైనవి రెండు అంశములు యుద్ధము యెక్కడనుంచి జరుగుచున్నదనునదొకటి రెండవది యీకాలములో సరఫరా యేవిధముగా జరుగుచున్న దనునది. మొట్టమొదటిసారి యిప్పుడే సామ్రాజ్యానికంతటికిని మూలమైన గ్రేటుబ్రిటనుకు ప్రమాదము వచ్చినట్లున్నది. ఆప్రమాద మేమిటి, దానినియెదుర్కొనుటయెట్లు?

శత్రువుకు అపారమైన వాయువిమానదళమున్నది. దగ్గరనుంచి విమానదాడి చేయుటకు తగిన స్థానములను శత్రువు ఆక్రమించినాడు. గొప్పగా సంసిద్ధము చేయబడిన సైన్యమున్నది.

అయితే బ్రిటను యెదుర్కొనుటకు సముద్రముమీదుగా గాని, విమానాలలో గాని యీ సైన్యమును యే విధముగా రవాణాచేయగలరు! చేయలేకపోయినచో బ్రిటనును ఓడించుటకు యివి నిరుపయోగములగును.

శత్రువుకు సామర్థ్యముగల నౌకాబలమున్నది. కాని సంఖ్యలో బ్రిటనుకున్నంతలేదు. అయితే చాలా రేవుపట్టణములను పట్టుకొనుటచేత బ్రిటిషుసముద్రముపై రాకపోకల కడ్డుకలుగ జేయుటకు సముద్రముపైనుంచిగాని, జలాంతర్గాముల ద్వారా గాని యెదుర్కొనవచ్చును. వాటిసహాయముతోనే భూమిమీద పోరాడుసైన్యముల నురవాణా చేయవచ్చును.

### బ్రిటను రక్షణశక్తి

ఇన్నివిధాల అపాయములను బ్రిటను యేవిధముగా నెదుర్కొనగలదు? ఇప్పుడొక్క విషయము ముఖ్యముగా కనబడుచున్నది, బ్రిటను తలబలమునంతను యితర దేశరక్షణలకు గాను పంపకుండ స్వదేశరక్షణకు గా నుపయోగించుకొనవచ్చును.

విమానదళము శత్రువుకున్న దానికన్న సంఖ్యలో తక్కువైనను శక్తిసామర్థ్యములలో యెక్కువైనదని నిరూపణయైనది స్వదేశాశ్రయముల నుండి పనిచేయుట గట్టిగా ఒకచోట పనిచేయగల శక్తిని సంపాదించినది.

కొద్దిపాటి దూరముపోయి పోట్లాడు విమానములు శత్రువిమానములతో బాగుగా డీకొనగలవు. వాటికి బాగుగా నేలమీద రక్షణ సైన్యములును తోడ్పడును.

శత్రువిమానములు మనరక్షణ శ్రేణులపై చొచ్చుకొని రావచ్చునుగాని వారి విమానములు, వైమానికులు చాలవరకు నష్టపడవలసి యుండును.

ఆదిలో శత్రువువిజృంభించి యెదుర్కొనును. అపుడు అధర్మకార్యములు చేసినను, యెన్ని విమానములుపోయినను, యెంతపనిజరిగినను భావమేర్పడును. అయినను బ్రిటిషు వైమానిక దళమునకు మంచిశిక్షణబొందిన వైమానికులు, పరికరములు విదేశముల ఫ్యాక్టరీలనుండి రాగలవు.

ఇంకొకవిషయముగూడా మనస్సులో నుంచకొనవలెను. బాంబులను వేసే విమానములు శత్రుదేశంలోనికి చొచ్చుకొనిపోగలవి, మంచిశక్తివంతములైనవి బ్రిటనుకున్నవి— ఫ్రాన్సులో నేలమీద యుద్ధము చేయుటకు పైనుంచి ఉపయోగించిన విమానములవంటి వారిపైకి పోనక్కరలేదు.

శత్రువుతో పోల్చదగినంత సైన్యము బ్రిటనుకు సంఖ్యలోగాని బలములోగాని లేదు. సముద్రముమీదుగాగాని విమానాలలోగాని దండెత్తివచ్చేవారి నెదుర్కొనటానికి బ్రిటనులో యిప్పుడు ౧౮–౨౦,౦౦౦ దండధరులున్నారు. ఈసైన్యము దేశరక్షణకోసము సిద్ధముగా ఉన్నది. ఇదిశత్రువు విమానాలలోగాని సముద్రములోగాని కష్టముమీద తేగలిగినవాని నెదుర్కొనుటకు శత్రువుకున్న శక్తికన్న మించియున్నది.

### నౌకాదళము

ఇప్పటికి బ్రిటను నౌకాదళ మేరక్షించును. అది అత్యధికముగ పెరుగుచున్నది. విమానబలముతోను, మందుగనుల రక్షణతోను బ్రిటిషుతీరానికి సైన్యములు రాకుండ నిషేధించగలవు. శత్రువు యిందుకు గావలసిన నౌకల నెన్నింటిని సిద్ధముచేసినను ప్రయోజనము లేదు.

ఇంకను శత్రువుచేయగల్గినది, గాలి అనుకూలముగా నున్నయెడల విమానములలో వచ్చిదాడిచేసి పోవుచుండవచ్చును. అవిధముగావచ్చుసైనికులు దేశములోదిగినను వారికింకను సైన్యములను విమానదళమును గావలెను. కాని నౌకాదళము అవిధముగా సైన్యములు రాకుండ ఆపగలదు.

మొత్తముమీద బ్రిటనుకు విమానముల దాడివల్ల యెక్కువభయము కల్గనున్నను, రక్షణశక్తి యేమాత్రమును తగ్గలేదు. ఉన్నశక్తులన్నియును కేంద్రీకరించుటవల్ల యెక్కువబల మేర్పడినది: ఇంకను సామ్రాజ్యములో మిగిలినభాగము చాలా భద్రముగ నేయున్నది.

సముద్రముమీద రాకపోకలనుగూడ నౌకలు రక్షింపగలవు. యుద్ధములో నుపయోగింప నవసరములేని ఓడలు, నష్టపడిన మిత్రమండలి దేశములవి వ్యాపారపు ఓడలబలము నెక్కువచేసినవి. ఇందువలన అనుకొనకుండ గలిగిన నష్టమును పూడ్చగలవు.

మొత్తముమీద, బ్రిటిషు సామ్రాజ్య మెంతకాలమైనను రక్షించుకొనుచు యుద్ధముచేయుటకు మంచిబలమైనస్థితిలోనున్నది.

### దెబ్బగొట్టుశక్తి

అయితే శత్రువును దెబ్బగొట్టుశక్తి తుదకు విజయమును సాధించునది యెంతవరకున్నది.

ఇదిచాలా పెద్దసమస్య. దీనినిగురించి యించికోసారి వ్రాసెదను.

అయినా యిందుకు ప్రత్యుత్తరమును సూచనగా చెప్పెదను.

బ్రిటను ముట్టడిని పూర్తిగాజరిపి విమానముల ద్వారా యుద్ధముచేసి గెలువవలెను.

ముట్టడి గట్టిగాచేయుటకు నౌకాదళము గట్టిగా పనిచేయవలెను. నాజీలకు నూనెసరఫరా కాకుండ చూడవలెను.

బ్రిటను వైమానికబల మెక్కువై జర్మనీసైనిక బలమును మూలస్థానములగొట్టి తుదకు జర్మనీ వైమానికి బలమును నాశనముచేయవలెను,

ఈయుద్ధమును బ్రిటను కేవలము ఆత్మరక్షణ కోసమే చేయుటలేదు. నాజీజర్మనీని ఓడించి ఆబలమును విచ్ఛిత్తిచేయుటకై చేయుచున్నది.

—

## భారతహిందూలీగుసభ

లక్నో, జూను 27

నేడు యిక్కడ భారత హిందూలీగు సభజరిగినది.

"భారతదేశరక్షణ నిమిత్తము భారతీయులకు అనుకూలమైన రీతిని సైనికదళ విమానదళములను నౌకాదళమును వెంటనే యేర్పాటుచేయవలెను. భారతసేనలో నవీనకాలపు యేర్పాటులన్నియు ఉండవలెను. ఇండియాకు సముద్రతీరం మిక్కిలి విస్తారంగాకుంది. దీనిసంరక్షించుటకు నౌకాదళముకూడా చాల పెద్దదిగానే వుండవలెను. గొప్ప విమానదళమునుకూడ ఇండియాలో యేర్పాటుచేయవలెను. యుద్ధనౌకలు, గాలినౌకలు, టాంకులు సాయుధములైన కారులు మొదలైనయుద్ధసామగ్రులన్నిటిని ఇండియాలో తయారుచేయించుటకు యేర్పాటుచేయవలెను. యుద్ధవిషయములోకూడ ఇండియా స్వయంపోషకముగానే వుండవలెను." అని సన్మానసంఘాధ్యక్షుడు కున్వార్ గురునారాయణగారు చెప్పిరి. ఇదేవిధముగ ఒకతీర్మానము సభలో ఆమోదింపబడెను.

—=

# కాంగ్రెసు కార్యసంఘ నిర్ణయము

## గాంధిమహాత్ముని అభిప్రాయము

"హరిజన" పత్రికలో గాంధిమహాత్ముడు కాంగ్రెసు కార్యవర్గనిర్ణయమునుగూర్చి ఈ క్రింది అభిప్రాయమిచ్చిరి:

"కాంగ్రెసువాదుల కిదియొక నూతనఅనుభవముగా నుండును. ఇట్టి విషమస్థితి నెదుర్కొను అవకాశము యిదివరకు కాంగ్రెసువాదులకు కలిగియుండలేదు. మతకలహములలో పనిచేయుటకు తాను యేర్పరచిన శాంతిసేనలు సరిగా పనిచేయలేదు. కావున నాస కల్పమును తాము అంగీకరింపజాలమని చెప్పిరి.

నాస్థితివేరు. కాంగ్రెసువారు దౌర్జన్య రాహిత్యమును పాలిసీగా అనగా కార్యపద్ధతిగా నవలంబించియుండిరి. దౌర్జన్యరాహిత్యము ఫలకారి కాకపోయినచో దానిని వారు నిరాకరింపగలరు. దౌర్జన్యరాహిత్యమువలన ఆర్థిక, రాజకీయస్వాతంత్ర్యము లభింపనిచో దానిని వదలివేయుటకు వారికి స్వాతంత్ర్యముండెను. కాని అహింస నాపరమధర్మము. నేను ఒంటివాడనైనను, సహచరులున్నను అహింసను నేనుతప్పక అనుసరింపవలెను. అహింసను వ్యాపింపజేయుట నాజీవితపరమావధియగుటచేత అన్నిసమయములలోను దానిని నేను ఆచరింపవలసియున్నది. భగవంతునియెదుట మానవునియెదుట నావిశ్వాసము రుజువుచేయుటకు సమయమాసన్నమయ్యెనని నేనుతలచితిని, కావున కమిటీనుండి తొలగనివ్వవలసినదని కోరితిని. ఇదివరకు కాంగ్రెసువిధానము నడుపుటకు నేను బాధ్యుడనుగానుంటిని. వారికిని నాకును ముఖ్యవిభేదములు పొడచూపినప్పుడు యికమీద నేనట్లు చేయుజాలను. నాస్థితి సరియైనదని వారు అంగీకరించిరి. తమయందుంచబడిన విశ్వాసము ఊరకపోలేదని వారు రుజువుచేసిరి. తాముగాని, ఇతర కాంగ్రెసువాదులుగాని తమచర్యలలో నిష్కర్షగా అహింసామార్గమును అమలుచేయుదురను విశ్వాసము వారికి లేకపోయెను. కావున వారవలంబింపదగిన ఒక్కమార్గమును వారవలంబించిరి. వారుచేసినత్యాగము చాలగొప్పది. కాంగ్రెసువారు అకలంకమగు అహింసామార్గమును నవలంబించు సంస్థయని ప్రపంచములో నింతవరకు కలిగినపేరు ప్రఖ్యాతిని వారు వదలుకొనిరి. అంతియగాదు. నాకును వారికినిగల అవినాభావసంబంధమునుగూడ వారు త్రెంచుకొనిరి. ఆశయములోను, విధానములోను భేదములు పొడచూపినను, ౨౦ సంవత్సరములకుపైగా మాకుయేర్పడిన స్నేహబంధములు తెగిపోలేదు.

### దుఃఖముతో మిళితమైనసంతోషము

ఫలితంవలన నాకుసంతోషము,దుఃఖముగూడ కలిగినది. ఎడబాటనుభరించి, ఒంటరిగా నిలువగలబలము భగవంతుడిచ్చినందుకు సంతోషము, యిన్నాళ్ళనుండియు నామాట వినుచుండినవారిచే నామాట అంగీకరింపజేయ జాలకపోతినిగదా యనుదుఃఖము నాకుకలిగినది. అహింసయొక్క ప్రాశస్త్యమును, బలవంతులగువారికి సహజమగు అహింసయొక్క ప్రాశస్త్యమును ప్రపంచమునకు చాటుధైర్యమును భగవంతుడు నాకొసంగుచో ఎడబాటు తాత్కాలికమగును. మార్గమే లేనిచో నన్నువారు విడుదలచేయుట వివేకమని తేలును, నాదౌర్బల్యము నాకుస్పష్టముకావలసిన దుర్దినమువచ్చుచో, అప్పటికిని ఇన్నాళ్ళనుండియు నాకు ఏడుగడగానున్న విశ్వాసమును వీడను అహింసాజ్యోతిని వ్యాపింపజేయుశక్తి నాకు లేకపోయెను గదాయను నమ్రభావమును కలిగియుందును.

కాని, ఈ వాదము, ఈసందేహము వర్కింగుకమిటీసభ్యులు అసంఖ్యాకులగు కాంగ్రెసువాదులలో చాలయెక్కువమంది అభిప్రాయమును ప్రకటించుచున్నారను ఊహపై నాధారపడియున్నది. కాంగ్రెసువాదులలో నత్యధిక సంఖ్యాకులు అహింసా ప్రపూర్ణులుగా నుండవలెనని వారు వాంఛింతురు. నేనుఆశింతును. కాంగ్రెసువారిశక్తిని తాముసరిగా గ్రహింపలేదని తెలిసికొనుచో వారికంటె యెక్కువగా సంతోషించువారుండరు. బలవంతులగు వారిఅహింసను అవలంబించువారు మెజారిటీలోనుండరు. మైనారటీలోనేయుందురు.

ఈ విషయమున వాదించి ప్రయోజనములేదు. వాదములన్నియు వర్కింగ్‌కమిటీవారి పక్షమునవేయుండెను. కాని, అహింసహృదయమునకు సంబంధించినది విజ్ఞానమునకు సంబంధించినదిగాదు. కావున కావలసినది దౌర్జన్యవిరహితమగుబలమును ప్రకటించుటయే, అందరికిని అవకాశములుకలుగును మతకలహములప్పుడు, బందిపోట్లప్పుడు, వాక్కలహములప్పుడు దౌర్జన్యరాహిత్యమును ప్రకటింపవచ్చునుకలను, తగినంతగా మనము అహింసను అవలంబించునో, యితరులకది మార్గదర్శకముగానుండును. కేవలము అహింసయందుగల ద్వేషభావముచే అహింసను తూలనాడువారెవ్వరునుండరు. దేశవిషయములలోను, అంతర్జాతీయ విషయములలోను కాంగ్రెస్‌వారు అహింసనే అవలంబింపవలెనని కోరువారు తమ దైనికజీవితమునందు అహింసను ఆచరించి చూచెదరుగాక! ప్రతి విషయమునందును వారు అహింసాసిద్ధాంతమును అవలంబింపవలెను. కాంగ్రెసువారు లిట్లు వ్యవహరించుటలేదు. గనుక, అంతఃకలహములను వెలుపలివారి దండయాత్రలను కాంగ్రెసుసభ్యులు అహింసచే నెదుర్కొన సిద్ధముగాలేరని కార్యసంఘమువారు తలచిరి. దౌర్జన్యవిరహితముగా ప్రజలువ్యవహరించుచో ప్రభుత్వమువారు ప్రజలకు లొంగవచ్చును కాని అల్లరులుజరుగు సమయమున అది ప్రయోజనకారికాదు. ఎదురుతిరుగకుండ మనము మరణము నాహ్వానింపవలెను. అల్లరులు చేయువారియెడల మనము కోపము, ద్వేషము కలిగియుండరాదు. ఈసందర్భములలో అవసరమగు అహింస కాంగ్రెస్‌వారికిదివరకు తెలిపియుండిన అహింసకంటె భిన్నమైనదని స్పష్టముకాగలదు. కాని యిదియే నిజమైన అహింస.ఇదియే ప్రపంచము రక్షింపగల అహింస యుద్ధములనుండి విముక్తి కోరుచు దారి తెన్ను తెలియక ప్రపంచమునకు భారతదేశమునిజమైన, అహింసనుపదేశింపనిచో ప్రపంచ వినాశము త్వరలో సంభవించును.

# అమూల్యమైన మా ప్రచురణాలు

### తగ్గింపుధరలు. ౧ నెలవరకు మాత్రమే

౧- నిజాంరాష్ట్ర పరిపాలనము- కర్త సురవరము ప్రతాపరెడ్డిగారు. ౧౦౦ ప్రతులు మాత్రమే మిగిలినవి. మరల ముద్రింపబడవు. ధర ౬ అ- ఇప్పుడు ౪ అణాలు-

౨- ఉచ్ఛలవిషాద నాటకము- కవి. సురవరము ప్రతాపరెడ్డి. కల్హణ కవీంద్రుని ౯౦౦ ఏండ్లక్రిందటి కాశ్మీరదేశ చరిత్రయగు రాజతరంగిణినను సరించి వ్రాయబడినది.
ధర ౧౨ అ- ఇప్పుడు ౮ అణాలు

౩- గోలకొండ కవులసంచిక- ౩౫౪ రాష్ట్ర కవుల ఉత్తమ కవితయిందుగలదు. ౨౦౦ పూర్వకవుల చరిత్రకలదు. అట్టి చారిత్రిక పరిశోధనతోకూడిన కవులచరిత్ర కమూల్యమైన సహాయకారిగానున్నది. పుటలు ౪౫౦. సైజుడబుల్ క్రౌను. దీనికిపోస్టేజిఖర్చే ౧౦ అణాలు.అనేక పటాలున్నవి
అస్సలుక్రయము ౨ రూపాయలు. ఇప్పుడు ౧ రూపాయి మాత్రమే.
(ముందే క్రయము టప్పావ్యయము పంపితే నేపంపబడును.)

౪. సుధాలహరి. ౯౫౦ ఏండ్లక్రిందటి ప్రాచీన జైనకవియగు అమితగతసూరి విరచిత మనోహరమగు నీతిశ్లోకాలు. వాటికి తెనుగు పద్యాలు, తెనుగు తాత్పర్యము.
వెల ౨ అణాలు. ఇప్పుడు ౧ అణా

౫. కవి కర్ణామృతం. మేల్నాటి లక్ష్మయ్య విరచితము. పాటలు, పద్యాలు కలవు. ౧౧౦ పుటలు. ౧౦౦ ప్రతులు మాత్రమే. వెల ౨ అణాలు మాత్రమే.

౬- కృష్ణార్జున సంవాదము- కవి నాదెండ్ల గోపప్రధాని. ౫౦౦ ఏండ్లక్రిందటివాడు. ఇది ద్విపదకావ్యము. ౧౨౦ ప్రతులు. మాత్రమే మిగిలినవి,మరలముద్రింపబడదు,గయోపాఖ్యానముకథ-
వెల- ౬ అణాలు- ఇప్పుడు ౩ అణాలు

౭- రెడ్డికుల నిర్ణయ చంద్రిక — శేషాద్రి రమణ కవులు, ౨౦౦ పుటలు.
ధర రు- ౧-౪-౦- ఇప్పుడు ౧౨ అణాలు

గమనిక:— ప్రతులూర్గొదిగనే యున్నవి-ఈ ధరలు ౨ నెలవరకే- తర్వాత ఈవిధముగా తక్కువధరలలో దొరకవు- గ్రంథాలు అసలేదొరకకపోవచ్చును-

దొరకు స్థలము:— గోలకొండ పత్రికాలయము.

## యుద్ధసహాయము

హైదరాబాదు(దక్కను), అమర్దాదు-౨౩-
సికింద్రాబాదు ధనికులు యుద్ధసహాయార్థము వడ్డీలేనిఅప్పులను ఈక్రిందివిధముగా యిచ్చినారు.

| | | |
|---|---|---|
| ఖా. బ. అల్లావుద్దీన్ గారు | | ౧౦,౦౦౦ |
| రఘునాథమల్లు | ,, | ౩౦౦౦ |
| ఓస్మంజీచీనాయి | ,, | ౫౦౦౦ |
| ఆర్. జీ. చీనాయి | ,, | ౧౦.౦౦౦ |
| డీ. చీనాయి | ,, | ౩౦౦౦ |
| దారాబుజంగు | ,, | ౫౦౦౦ |
| ఒకరు | | పౌండ్లు ౩౭౫ |
| ఇంకొకరు | | ,, ౨౭౫ |

## అహింసావిధానమే భారతీయులకుగతి

### గొప్పసేవమనలకు లభ్యముకాదు

### పండిత జవాహరలాలుగారి ఉపన్యాసము

బొంబాయి, జూను ౩౦

"మనదేశములో సేనను యేర్పరచదలచుచో యెంతటి ప్రబలశత్రువునైనను ఓడించుటకు అది సమర్థమైనదిగా నుండవలెను. అటువంటి సేనను మనము యేర్పరచలేకపోయిన, సేనయే నిరుపయోగము. ఫ్రాన్సుదేశమువారు, అనేకశతాబ్దములనుంచి యూరపులో అధికమైన ప్రశస్తిని కలిగియున్నారు కొత్తమారణయంత్రాల సహాయముతో జర్మనీవారు అటువంటి ఫ్రాన్సుదేశమును మూడువారములలో ఓడించినారు. ఢిల్లీసిమ్లా నగరాలమధ్య పదిసారులు తిరిగినంతమాత్రమువల్ల యిండియాలో మిక్కిలి గొప్పసేనను యేర్పరుపగలుగుదుమని కొందరు భావించుచున్నారు. ఇది కేవలము పరిహాసాస్పదమైనసంగతి. భారతీయుల కధికమైనసంగతి. భారతీయుల కధికమైన ధైర్యస్థైర్యములున్నమాట నిజమేకాని యిప్పుడు సైనికులసంఖ్య యెంతహెచ్చుగాపున్నను టాంకులు, బాంబులు మొదలైనమారణయంత్రములు నిమిషములోయెంతటి గొప్పసేననుకూడా నాశనముచేయగలవు. ఇటువంటిసమయములో చిన్నసేనలు అసలేపనికిరావు. సేనయేలేకున్నచో, హానికలిగించరు. ఏదోకొంతసేనతో వారితోయుద్ధము ప్రారంభించిన,వారికిఆగ్రహము మరింతఅధికమై వారుదేశమును పూర్తిగానాశనము చేయుదురు.

ప్రజలందరుకూడ అహింసానిరతులుగా వుండుటయే మిక్కిలిశ్రేష్ఠమైనపద్ధతి. శత్రువులు మనమీద బాంబులనువేసిన మనమేమియుచేయలేముగాని వారు మనదేశములో తమప్రభుత్వమును యేర్పరచకుండ మనము చేయగలుగుదుము.

భారతకాంగ్రెసు కార్యసంఘమువారికిని గాంధిమహాత్మునకునుగల స్నేహసంబంధమునకు భంగముకలుగలేదు. ప్రజలు ఏంగారుపడగూడదు. దేశములో శాంతిని నెలకొల్పవలెను. ఐకమత్యముగా స్వరాజ్యమును పొందుటకు సిద్ధముగానుండవలెను" అని నేడు ప్రార్థన బొంబాయికాంగ్రెసు భవనములో జరిగినసభలో జవహర్లాలుగారు చెప్పిరి.



## పాయగాలసైన్యాలు

హైదరాబాదు ప్రభుత్వమువారు మూడుపాయగాలలోని సైన్యాలను తమసొంతె అధీనములోనికి తీసుకొనదున్నారని అనుకొనబడుచున్నది. ఈ విషయమునుగురించి సైన్యాన్ని యియ్యవచ్చునా?లేదా? అని పాయగానవాబులు కొందరి అభిప్రాయాలను గైకొనుచున్నారట.

## కిర్లోస్కరు భార్య

హైదరాబాదు(దక్కను). అమర్దాదు-౨౨
డాక్టరు కిర్లోస్కరు అనువారిభార్య జర్మనీ స్త్రీ. హైదరాబాదలో ఈమెయున్నారు. ఆజర్మనీ స్త్రీ సామానును పోలీసువారు మంగళవారమునాడు సోదాచేసినారు. హైదరాబాదు రాష్ట్రమునుండి బయటికి వెళ్లిపోవలసినదని ఆమెకు ఆజ్ఞయిచ్చినారు.

## గ్రంథనిషేధము

నిజామురాష్ట్రములోని స్వామీ రామానందతీర్థగారు వ్రాసియీక్రింది గ్రంథాలు రాకూడదనియు, దొరికినవున్నను జప్తుచేయబడునవియు హైద్రాబాదు ప్రభుత్వమువారాజ్ఞాపించియున్నారు.

౧ కిసాన్ మజ్దూర్ (మరాఠీ) ఇదిపూనాలో సమర్థప్రెస్సులో అచ్చైనది
౨ కిసాన్ మజ్దూర్ (కన్నడము)
౩ "ప్రాథమికస్వత్వములు, హైద్రాబాదు రాష్ట్రము"(కన్నడము)
౪ "హైద్రాబాదు రాష్ట్రములో విద్యాస్థితి"(కన్నడము)
౫ "హైద్రాబాదురాష్ట్రానికి ఎట్టిసంస్కారాలు అవసరము"(కన్నడము)

## ఆరణాల రాటము

ఢిల్లీ, జూను ౩౦

నేడుమధ్యాహ్నము ఢిల్లీలో డాక్టర్ షౌకతుల్లాఅన్సారీ గారియింట్లో ఢిల్లీచరఖాక్లబ్బుసభ్యులతో గాంధిమహాత్ముడు అరగంటసేపు మాట్లాడెను. మహాత్ముడు ఒకకొత్తరకపు రాటముమీద నూలువడికెను, "దీనిఖరీదు ఆరుఅణాలు మాత్రమే. బీదవారుకూడా దీనినికొని నూలుతీయవచ్చును రాట్నముమీద నమ్మకముగలసభ్యులకు మాత్రమే ప్రతిదినము నూలువడుకవలెనను నిర్బంధము వుండవలెను." అని మహాత్ముడు చెప్పెను.

## ఇండియాలోని యూరపీయులకు నిర్బంధ సైనికసేవ

### లార్డుల సభలో శాసనామోదము

ఇండియాలోని యూరోపీయులకు నిర్బంధసైనిక సేవను విధించుటకు వైస్రాయిగారికి అధికారమిచ్చు చిత్తుశాసనము బ్రిటీషువార్ల మెంటు కామన్సుసభలో నెగ్గియుండినసంగతిని గత సంచికలో చూచితిమి. అచిత్తుశాసనము లార్డుల సభలో జూను ౨౭వ తేదినాడు ప్రవేశపెట్టబడి ఆమోదింపబడెను. తర్వాత వెంటనే, దానిని సార్వభౌముడా మోదించినాడు. ఇప్పుడది శాసనమైనది.

కార్మికపక్షము తరపున లార్డుల సభలో బిల్లును బలపరచిన లార్డ్ స్ట్రాబోల్గిగారు "ఇండియాలో ఇపుడున్న బ్రిటిషుసైనికులలో కొందరిని విదేశములకు తీసికొనిపోవలసివచ్చును. అప్పుడు ఇండియాలోనున్న బ్రిటిషు పౌరులు, వారిస్థానమున సైనికులుగా అమరుట ఇండియాదేశరక్షణకు అవసరము" అని చెప్పిరి.

సంవత్సరము చందా
౭ పోలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

*Volume* **15** **Hyderabad-Dn.** **Thursday** **July 4 1940** *Number* **18**

## గాంధి వైస్రాయిగారల సంభాషణలు

### కాంగ్రెసు కార్యవర్గ అత్యవసర సమావేశము

సిమ్లా, జూ౯ ౨౯

నేటిదినము సిమ్లాలో మధ్యాహ్నము మూడు గంటలు ౬గంటలవరకు వైస్రాయి, గాంధిమహాత్ముడు సంభాషణలు జరిపిరి. యుద్ధము ప్రారంభమైనపిమ్మట మహాత్మునితో రాజప్రతినిధి సంప్రదించుటకిది ఆరవపర్యాయము. ఐరోపా సంఘటనములు, వాటివల్ల భారతదేశమునకు కలుగగల మంచిచెడ్డలను గురించియు, యుద్ధ కార్యమునకు కాంగ్రెసువారు ఎంతవరకు సహాయపడెదరను విషయముగురించియు సంభాషణజరుప రాజప్రతినిధి గాంధిగారిని ఆహ్వానించిరని ఊహలున్నవి. గాని ఏయేవిషయములు గురించియు సంభాషణలు జరిగినవో యాథిగ తెలయదు.

**మహాత్మునకు సంతృప్తి కలుగలేదా?**

మహాత్ముడు వార్ధానుండి సిమ్లాకు ప్రయాణమైనప్పుడే ఒక దినముకన్న ఎక్కువకాలము సిమ్లాలోనుండవలసిన అవసరముండదనితలచి, అవిధముననే తనకార్యక్రమమును నేర్పరచుకొనెను. ఈ కార్యక్రమము ప్రకారము నేటిరాత్రే మహాత్ముడు సిమ్లా వదలిపోవుటనుబట్టి మహాత్ముడు తలచినవిధముననే ఈసంభాషణ వారికేమాత్రము సంతృప్తి కలుగజేయలేదని తోచుచున్నది. జిన్నా గారితో సంప్రదింపులు జరుపుటవల్లగాని, మరల రాజప్రతినిధితో సంప్రదించుటవల్లగాని లాభముండదని తలచియే మహాత్ముడు వర్ధాకు ప్రయాణమైనట్లు ఊహింపబడుచున్నది.

**కాంగ్రెసు కార్యసంఘ సమావేశము.**

కాంగ్రెసు కార్యసంఘసభ్యులందరు వర్ధా వదలిపోయినపిమ్మటనే మహాత్మునకు వైస్రాయి ఆహ్వానమందినదనియు. సంభాషణల విషయమునుగురించి ఈఆహ్వానములో ఎట్టిసూచన లేకుండెననియు, ఈకారణములవల్ల ఆ విషయమై మహాత్ముడు కాంగ్రెసునాయకులతో ఆలోచనలు జరుప వీలులేకపోయినదనియు తెలియుచున్నది. వైస్రాయి సూచనలవిషయమై తన అభిప్రాయము లేవిధముగనున్నను కాంగ్రెసు కార్యసంఘసభ్యులతో ఆలోచింపకయె ఖాయమగు ప్రత్యుత్తరమిచ్చుటకు వీలులేదని నేటిదినము జరిగినసంభాషణలలో మహాత్ముడు వైస్రాయికి స్పష్టపరచినట్లు తెలియుచున్నది వైస్రాయి భవనమునుండి తిరిగివచ్చినపిమ్మట పత్రికాప్రతినిధులు మహాత్ముని సందర్శించి ప్రశ్నించిరిగాని మహాత్ముడు వారికెట్టి సమాధానము చెప్పలేదు.

**మహాత్ముడు సిమ్లా వదలిపోవుట**

మహాత్ముడు వైస్రాయితో సంభాషణ ముగించి మేనరుస్విల్లి చేరుసరికి సాయంకాలము ౬-౩౦ గంటలయ్యెను. గాంధిగారు మిత్రులతో కొన్ని నిమిషములు సంభాషించి ఆహారము తీసికొని ౭-౪౫గం. సిమ్లానుండి ఢిల్లీకి ప్రయాణమైరి.

**ఢిల్లీ చేరుట**

ఢిల్లీ. జూ౯ ౩౦

నేటిదినము ఉదయము ౯-౧౦గం.లకు మహాత్ముడు సిబ్బందితో ఢిల్లీచేరిరి.

స్టేషనునుంచి గాంధిమహాత్ముడు హరిజన్ కాలనీవైపుకారులో పోయెను. దారిలో వారికి రెండుమైళ్ళు నడిచిరి. తరువాత డా॥ సౌకతాలీ అన్సారీగారియింటికి చేరిరి.

### కాంగ్రెసు కార్యసంఘ అత్యవసర సమావేశము

నైనిటాలు, జూను ౨౯

ఈఉదయము కాంగ్రెసు అధ్యక్షుడు మౌలానా అబుల్ కలాంఆజాదుగారు గాంధిమహాత్మునితో టెలిఫోనులో మాట్లాడిరి. దానిమీదట జూలైనెలవతేదీ ఢిల్లీలో కాంగ్రెసు కార్యసంఘ అత్యవసరసమావేశము జరుగునటుల మౌలానా ఆజాద నిర్ణయించెను.

**కార్యక్రమం మార్పు**

గాంధిమహాత్ముడు వర్ధాకు వెళ్ళవలసియుండగా హఠాత్తుగా కార్యక్రమమును మార్చుకొనిరి. కాంగ్రెసు కార్యసంఘ సమావేశమయ్యేవరకును యిక్కడనే ఉందురు.

యునైటెడు ప్రెసుప్రతినిధి అడుగగా "స్థితిగతులు నిన్న ఎట్లావున్నవో నేడుకూడా అదేవిధంగావున్నవి" అని గాంధిమహాత్ముడు చెప్పెను.

### ఫార్వర్డు బ్లాకు

**నూతన కార్యనిర్వాహక వర్గము**

కలకత్తా, జూను ౩౦

"ముందుసంవత్సరమునకు అఖిలభారత ఫార్వర్డుబ్లాకు కార్యసంఘ సభ్యులను నియమించుటకు జూను ౧౮-౧౯వ తేదీలలో నాగపూరులో జరిగినసభలో భారతఫార్వర్డుబ్లాకువారు నాకధికారమిచ్చినారు ప్రస్తుతము నేనుకార్యసంఘము అధ్యక్షునిమాత్రమే నియమించెదను. ఇప్పుడు సంఘములో ఆరమందిసభ్యులున్నారు. ముందు గానని చేయుటకును యిూచిన్న సంఘముసభ్యుల పేర్లను నేనుత్వరలోనే ప్రకటించుదును. ఈకాలము వెళ్లిపోవుటకును యిూచిన్నసంఘమువారేపనిచేయువందురు. తరువాత మామూలు కార్యసంఘము నారేపనిచేయును, సర్దారు శార్దూలసింగు గారిని నేనుఅధ్యక్షునిగా నియమించితిని" అనిసుభాసు చంద్రబోసు గారు ప్రకటించినారు

### బ్రిటను-ఇటలీల యుద్ధము

బ్రిటను-ఇటలీలయుద్ధములో కూడ విశేషము లెక్కువలేవు. విమానముల దండయాత్రలు, చిన్నచిన్న సేనలు ఢీకొనుట – ఇంతవరకే జూను ౨౭వతేదినుండి౩౦వ తేదీవరకుజరిగినసంఘటనలు.

**ఇటలీ విమానాల దాడులు**

జూను ౨౩వతేది మాల్టాపై ఇటలీవిమానాలు నాలుగుసార్లు దాడివెడలెను. జూను౨౫వతేది ఇట్లే రెండుసారులు దాడికైరోగా వాటిని బ్రిటిషువారి విమానాలు తరిమివేసెను. జూను౨౯వ తేది రెండుసార్లు ఇటలీవిమానాలు మాల్టాపై దాడిసెడలి బాంబులువేసెను. నేడుఒక ఇటలీ విమానాన్ని బ్రిటిషువారు క్రింద కూల్చిరి.

జూను ౨౮వతేది ఏడను మెర్సామాత్రు, జూను ౩౦వతేది సూడాన్‌రేవు-పీటిపై ఇటలీవారి విమానాలు బాంబులువేసెను. కడపటిచోట ఒక ఇటలీవిమానము క్రిందకూల్చబడెను.

**బ్రిటిషువిమానాల దాడులు**

ఇక బ్రిటిషువిమానాల దాడులనుచూతము. జూను ౨౫వతేది బ్రిటిషువిమానాలుఇరిత్రియాలోని మెకాకాపైఎగిరి పెట్రోలు ఖజానాలపైనను, బాంబుల స్థావరములపైనను బాంబులను వేసెను, పశ్చిమ ఎడారిలో ఎల్గుబి విమానాశ్రయముపై బాంబులనువేసెను. జూను౨౩వతేది ఉదయము లిబియాలోఎల్గుబిపై బ్రిటిషువిమానాలు బాంబులువేసి, ఒక విమానయుద్ధంలో శత్రువిమానాన్ని ఒకదానిని క్రిందకూల్చి మరొకదానిని దెబ్బకొట్టెను. రెండుబ్రిటిషువిమానాలజాడలేదు.

**మార్షల్ బల్బోమరణము**

ఈసారివార్తలలో ఒక గొప్పవార్త ఇటలీవారి విమానబలమునకు సృష్టికర్తఅని చెప్పదగిన మార్షల్ బల్బోగారు లిబియాలో ఇటలీసేనల అధికారిగానుండి జూను ౨౫వతేది విమానములో టోబ్రుకుపై ఎగురుచుండగా, ఆవిమానము మండుచు క్రిందకూలుటచే మరణించుటయైయున్నది. వీరిగౌరవార్థమై ఇటలీలో అన్నిప్రభుత్వ భవనాలమీదను జూను౨౯వతేది పతాకములు ధ్వజములమధ్యభాగమువరకు దించబడెను. ఈ బల్బోగారి విమానము బాంబువేయుటచే కాలెనని ఇటలీవారనుచున్నారు. కాని బ్రిటిషువారు తమవిమానములకీసంగతియే తెలియదనుచున్నారు. ఇపుడు బల్బోగారిస్థానమున ఇటలీగవర్నరు జనరల్‌గా మార్షల్ గ్రాజియానిగారు నియుక్తులైనారు.

**భూసేనల పోరాటాలు**

ఆఫ్రికాలో బ్రిటిషువారి కెన్యాకును, ఇటలీవారి అబిసీనియాకునుమధ్య బ్రిటిషువారిమొయేలుపై జూను ౨౫వతేది ఉదయము ఇటలీసేనలుదాడివెడలెను గాని, ఎట్టిప్రయోజనమును గాని సాధించలేదు: ఇరిత్రియా సరిహద్దువద్ద బ్రిటిషు పహరాసేనలు, యంత్రసేనలు శత్రుసేనలు కనపడినప్పుడెల్ల వాటిని వేధించి చెదరగొట్టబడుచున్నవి.

**సముద్రముపై చర్యలు**

ఈస్టిండీస్‌వద్ద రెండు ఇటలీజలాంతర్గాములు పాడుచేయబడెను. మధ్యధరాసముద్రంలో ఒక ఇటలీ డిస్ట్రాయరురకపుఓడ ముంచివేయబడెను. గ్రాంపూస్‌అను బ్రిటిషు జలాంతర్గామి ఇదివరకెన్నడో తిరిగి రావలసియుండి ఇంక నురాలేదు. అందుచే అది సముద్రములో మునిగియుండునని భయపడుచున్నారు.

### ఔరంగాబాదులో జైనదిగంబరసాదువు

ఔరంగాబాదు అమర్దాదు ౨౯-

ఔరంగాబాదులో కొన్నిరోజులనుండి జైనదిగంబర సాధువు ఒకరువచ్చియున్నారు. ఆయన ప్రతిరోజు దేవాలయదర్శనమునకై రెండు మూడుసార్లు దిగంబరుడై తిరుగుచుండును? పోలీసువారలు కాపలాకాయుచున్నారు

### ఇతర దేశాలపై బ్రిటిషు విమానాలు

జూను ౨౯వతేది రాత్రి స్విజ్జర్లండుదేశ మధ్యభాగమున ష్వీజాజిల్లాలో ౧౨బాంబులు పొలాలలోపడెను. ఈబాంబులను పరిశీలించి బ్రిటిషువారివనుచున్నారు

జూను ౨౫వతేదినాడు జిబ్రాల్టరునుండి తిరిగివచ్చుచు బ్రిటిషువిమానమొకటి స్పెయినువారి సముద్రభాగముపైకిరాగా టారిఫావద్ద ఆబ్రిటిషు విమానముపై స్పెయినువారు ఫిరంగులను బాయపెట్టి వదలిరి.

### బ్రిటనునుండి శిశువులను తొలగించుట

బ్రిటనులో యుద్ధభయముండుటచే బ్రిటను నుండి శిశువులను చాలమందిని బ్రిటిషువారి డొమినియనులగు కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండులకు పంపించుఏర్పాట్లు జరుగుచున్నవి.

### అమెరికా

పెనామాకాలువలో అమెరికా యుద్ధనౌకల రాకసందర్భమున రక్షణకై మందుగనులను విమానాలను కూల్చుఫిరంగులను ఏర్పాటుచేయబడుచున్నవి.

### ఐర్లెండు అవస్థ

ఐర్లెండులో రెండుభాగాలున్నవి. ఒకటి బ్రిటనునుండి చీలి డీవెలరాగారినాయకత్వమున నున్నది. ఇంకొకటి ఉత్తరఐర్లెండు. ఇది బ్రిటిషుపక్షములోనున్నది. ఇపుడు ఐర్లెండుమీదికి ఏశత్రువుపడునో అనుభయముచేత, దక్షిణఐర్లెండులో డివెలరాగారిపక్షముతో భిన్నపక్షాలవారందరును ఏకమైరని ఇదివరకే వినియుంటిమి. ఇపుడు ఉత్తరదక్షిణ ఐర్లెండులు రెండునుకలిసి శత్రువునెదుర్కొనునట్లు చేయుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. ఉత్తరఐర్లెండు ప్రధానామాత్యుడగు లార్డుక్రెయిగావన్‌గారు కౌన్సిలులో ఒకసభయందుపన్యసించుచు ఉత్తరఐర్లెండురాజ్యాంగమునుమాత్రము మార్చుటకు తానంగీకరించదనియు, కాని దక్షిణఐర్లెండు బ్రిటనుపక్షానచేరి జర్మనులను ఇటాలీయులను తమరాజ్యములోనుండ తొలగించుచో, తాను డివెలరాగారితో కలిసిపనిచేయుటకు దక్షిణముతోడ్పడగలనని యుచెప్పిరి.

### ఈజిప్టులో క్రొత్త మంత్రివర్గము

ఈజిప్టురాజు ఫరూక్ గారు హసన్‌సేబ్రీ పాషాగారిని క్రొత్తమంత్రివర్గము నేర్పాటుచేయుటకై కోరినారు. ప్రాంవ ప్రధానియగు అలీ మెహరు పాషాగారు ... ముగ్గురిమాత్రమే హసన్ సేబ్రీ పాషాగారు తమమంత్రివర్గములోనికి గ్రహించినారు. ... అన్నిపక్షముల ప్రతినిధు ... ఈజిప్టు యుద్ధములో ... చు, బ్రిటనుతో ... గౌరవముతోపాటించుటకు ... కొనియుండెను. ఇప్పుడువచ్చిన హసన్ సేబ్రీపాషాగారిదివరలో లండనులో ఈజిప్టుపక్షాన ప్రతినిధిగానుండిరి.

### బ్రిటిషు మంత్రివర్గ ఐకమత్యము

ఈమధ్య బ్రిటిషు మంత్రివర్గమువారిలో ఏకాభిప్రాయములేదని జర్మనురేడియోనుండి గావించిన ప్రచారమును నెవిల్ చేంబర్లేనుగారు జూను ౩౦వ తేదిరాత్రి రేడియోభాషణములో ఖండించి జయము కలుగునంతవరకు నాజీజర్మనులతో పోరాటకు బ్రిటిషు మంత్రివర్గము ఏకాభిప్రాయములో కృతనిశ్చయమై యున్నదనిచెప్పిరి.

### ముసాఫిర్ఖానాముందు వాద్యము

**జెయిలుశిక్ష-జుర్మానా**

(ఒకవిలేఖకుడు)

ఆదిలాబాదుజిల్లా బోథ్ తాలూకాలో ఇచ్చోడ అనేగ్రామముకలదు. జనసంఖ్య ౪౦౦. ఇచ్చటపోలీసు ఠానాయున్న టపాయున్న కలదు. ఇచ్చట కొన్నిదినాలక్రిందట ఒకకాపు మరణించెను. శవాన్ని స్మశానానికి వాద్యయుక్తముగా బంధువులుతీసికొనిపోయిరి. త్రోవలో ముసాఫిర్ఖానాను సమీపించిరి. అంతలో జమేదారుగారు ఒకజవానునుపంపి అచ్చటనే ముసాఫిర్ఖానాముందు శవాన్ని ఆపవలెనని ఆజ్ఞాపించిరి. ఆదేశప్రకారమాపిరి. జమేదారుగారు ఠానానుండివచ్చి "అరేమీరు యీమసీదుముందు బాజాఎట్లావాయిస్తిరి. ఇది ౧౩౪౭ ఫసలీలో మసీదుగామారింది మీకుతెలియదా?" అనిగర్జించి అచ్చటనే పంచునామాచేసి నలుగురుయువకులను తమఇష్టమువచ్చినవారిని అందులోనుండి ఏర్చికొనివారిపై చాలాన్ వ్యవహారము సాగించిరి. చాలాన్ చేయబడిన యువకులలో నలుగురున్నూ గొప్ప భూస్వాములు గౌరవకుటుంబములవారున్ను అయిన లోకనారాయణరెడ్డి నిమ్మలభూమన్న నిమ్మలశివన్న వీరరెడ్డి జన్న అనువారు, వీరుకాక నలుగురుమాదిగవాళ్లను కూడపట్టుకొని వీరిని రిమాండులోఉంచి తరువాత జమానతుపై విడుదలచేసిరి. బోధునున్సిఫ్ కచ్చేరీలో విచారణజరిగెను. నాలుగుపేషీలు జరిగినతర్వాత నేరస్థాపన (ఫర్దజురం) వినిపించిరి. ఇంతలో పోలీసు మున్తజింగారు తమాపణకోరుకుంటే విడిచిపెడ్తారుఅనిబోధించగా వీరుఅటు ప్రకారముచేసిరి.ఒకప్రక్క వకీలుద్వారానిందితులు వ్యవహారమునడుపుకొనుచుండిరి. "అప్పుటిస్థలము మసీదుకాదనియు. లోకనారాయణరెడ్డిమున్నగువారి తాతముత్తాతలు ప్రయాణీకులకొరకార్థము ధర్మబుద్ధికలవారై స్వయముగా ఖర్చుగా తమద్రవ్యాన్నిఖర్చుపెట్టి ముసాఫిర్ఖానాకట్టించియుండిరనియు. పైగావీరిపెద్దలే ఆదేముసాఫర్ఖానాలో మొహర్రం పండుగలో తాబూత్ పీర్లను పెట్టించి తమఖర్చుతోనే వేడుకలుచేయుచుచుండిరనియు," సాక్ష్యములిప్పించిరి. గ్రామపట్వారీగారు అందుముఖ్యమైనసాక్షి. అయినను ౧౩౪౯ ఫసలీనాడు పైనలుగురికి "మసీదు" ముందువాయించినందులకు తలా ౧వారంజెయిలుశిక్షయున్న, పోలీసుజవానుపైతిరుగబడియుండిరను నేరముపై ఒకనెల ఎక్కువగా జెయిలుశిక్షయున్న, ఉపరి ౧౦౦ రూపాయిల జుర్మానాయున్న విధించిరి. నలుగురుమాదిగలకుకూడ ౧వారం కఠినజెయిలుశిక్ష విధించిరి.

(గమనిక:—పోలీసువారిపైనను, టపాదారిపైనను వ్యక్తిగతమగు ఆరోపణలు విలేఖకుడు చేసినాడు. అవిప్రకటించుటకు వీలులేదు. పైఅధికారులకున్ను పోలీసు సదర్ నాజింగారికిన్ని వినతిచేసికొని వ్యవహారము చేసుకొనవచ్చును.

గో. స.)